మాయావినోదం -సూపర్ మేజిక్
డా॥ బి.వి.పట్టాభిరామ్ Ph.D
ప్రశాంతి కౌన్సిలింగ్ & HRD సెంటర్,
E1 సామ్రాట్ కాంప్లెక్స్, సెక్రటేరియట్ రోడ్,
హైదరాబాదు - 500 004.
Phones : 040- 2323 3232
e-mail : bvpattabhiram@hotmail. com
www.pattabhiram. com

ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 2004
చతుర్థ ముద్రణ : ఆగస్టు, 2008

వెల : రూ. **30-00**

బొమ్మలు
శ్రీ బి.వి.సత్యమూర్తి

ముద్రణ :
**విజయ-శాంతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
విజయవాడ-2. సెల్ : 9246479941.

ప్రచురణకర్తలు :
ఎమెస్కో బుక్స్
సూర్యారావుపేట, విజయవాడ -520 002
ఫోన్: 0866 - 2436643

దోమలగూడ, హైదరాబాద్ - 500 027
ఫోన్స్: 040-23264092, ఫ్యాక్స్ : 040-23264028
www.emescobooks.com
e-mail : emescobooks@yahoo.com

# ముందుకు పోయే ముందు

మేజిక్ అంటే అందరికీ ఇష్టమే. ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లుగా భ్రమ కలిగించే ఈ కళ నేర్చుకోవడానికి తెలుగులో తగినన్ని పుస్తకాలు లేవు. ఒకటి రెండు ఉన్నా, వాటి నిండా మంత్రాలు, తంత్రాలు గురించే రాశారు. నా చిన్నతనంలో అవి చదివి చాలా నిరుత్సాహంతో పాటు భయం కూడా వేసేది. కాలక్రమేణా మేజిక్కులు నేర్చుకున్నాక ఇందులో మంత్రతంత్రాలు లేవని తేలిపోయింది. మెజీషియనుగా ఒక గుర్తింపు వచ్చాక 'ఈనాడు' పత్రికలో ఆదివారం ఎడిటర్ శ్రీ చలసాని ప్రసాదరావుగారు 'ఈనాడులో పిల్లలకోసం మేజిక్కులు రాయొచ్చుకదా' అని అడిగారు. 'రాస్తే బావుంటుందా? మెజీషియన్లు బాధపడతారేమో' అన్నాను. "రాయకపోతేనే బావుండదు లేదా ఈ కళ అంతరించిపోతుంది. అందుకే ప్రజల్లో మేజిక్ పట్ల ఆసక్తి పెంచాలి. ఇదొక కళ అని అందరూ గుర్తించాలి. మీకు తెలిసినవి రాస్తే ఆపైన కొత్త కొత్తవి కనిపెట్టి ఇంకా అభివృద్ధి చెందవచ్చు" అన్నారు.

దాని ఫలితమే 'మాయావినోదం' 1977 లో ప్రతి ఆదివారం మేజిక్ గురించి వివిధ అంశాలు రాయడం ప్రారంభించాను. అవి ఐదేళ్ళపాటు నిర్విఘ్నంగా సాగాయి. అవి చదివి వందలాది ఔత్సాహికులు మెజీషియన్లుగా తయారయ్యి సమాజంలో మంచిపేరు తెచ్చుకొని తమకొక ఉపాధి కల్పించుకున్నారు. ఈరోజు మేజిక్ కళ మన రాష్ట్రంలో కళకళలాడుతుంది. ఒకప్పుడు ఐదారుగురు మాత్రమే తమ పట్టణాల్లో చేసే మెజీషియన్లుండే మన రాష్ట్రంలో నేడు 500కు పైగా ఉన్నారు. వారిలో జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో ప్రదర్శనలు చేస్తున్నవారున్నారు.

ఆ మేజిక్కులన్నీ గతంలో "మాయావినోదం" పేరుతో రెండు భాగాలు వచ్చాయి. వాటికి చాలా కొత్త అంశాలు చేర్చి ఇప్పుడు ఐదు భాగాలుగా ప్రముఖ ప్రచురణసంస్థ 'ఎమెస్కో' ప్రచురించారు. వారికి ధన్యవాదాలు.

మేజిక్ నేర్చుకోవడం వల్ల విద్యార్థుల్లో సమయస్ఫూర్తి, సృజనాత్మకత, రీజనింగు పెరుగుతుంది. శాస్త్రీయ పరిజ్ఞానం అభివృద్ధి చెందుతుంది. స్టేజ్ ఫియర్ పోతుంది. అనేక మేజిక్‌లకు చిన్న చిన్న సైన్సు సూత్రాలే ఆధారం. ఈ ఉద్దేశ్యంతో మీరు మేజిక్ నేర్చుకోవడం కోసం ఈ క్రింది ఐదు పుస్తకాలను మీకందిస్తున్నాను.

ఈ ఐదు పుస్తకాలు మీకు బాగా నచ్చుతాయనే నమ్మకం నాకుంది. 1. సైన్స్‌మేజిక్, 2. మేథ్స్ మేజిక్, 3. స్కూల్ మేజిక్, 4. సూపర్ మేజిక్, 5. స్టూడెంట్ మేజిక్

ఈ మేజిక్కులు నేర్చుకునేటప్పుడు మీ తల్లిదండ్రులు లేదా ఒక టీచరు పర్యవేక్షణ ఉంటే మంచిది. కెమికల్సులాంటివి ఉపయోగించినప్పుడు తప్పనిసరి అని మర్చిపోవద్దు.

ఈ పుస్తకంలో వివరించిన మేజిక్కులు ఒక పాఠశాల విద్యార్థి చేయగలిగే అనేక ఇంద్రజాల రహస్యాలు ఇందులో ఉన్నాయి. స్కూల్లో జరిగే వార్షికోత్సవ సభల్లో, జాతీయ పర్వదినాల్లో టీచర్ల ట్రాన్స్‌ఫర్ అయినప్పుడు జరిగే ఫేర్‌వెల్ పార్టీల్లో ఇవి చెయ్యవచ్చు. వీటికి ఉపయోగించే పరికరాలు కూడా సహజంగా అందరి ఇళ్ళలో లభించేవే ఉంటాయి.

మేజిక్ నేర్చుకోవాలనే అభిలాష కలవారు మూడు ముఖ్యమైన సిద్ధాంతాలు గుర్తుపెట్టుకోవాలి.

1. చేసే మేజిక్ ఫలితం ఎలా ఉంటుందో ముందే చెప్పకూడదు.

2. చేసిన మేజిక్కునే, మళ్ళీ అదే ప్రేక్షకుల ముందు చెయ్యకూడదు. అంటే "వన్స్‌మోర్" అని ప్రేక్షకులు అడిగితే "నోమోర్" అంటూ నవ్వుతూ మరో అంశంలోకి వెళ్ళాలి.

3. ప్రదర్శన అయ్యాక మేజిక్ రహస్యాలను చెప్పకూడదు. చెప్తే మీ వాల్యూ తగ్గిపోతుంది. ఓకే. గుడ్‌లక్

మీరు చదువుతోపాటు మంచి మెజీషియన్‌గా పేరు తెచ్చుకోవాలని ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ

మీ

బి.వి.పట్టాభిరామ్

## ఇందులో...

# వింత బంతి

పక్షులచే పలికించవచ్చు, జంతువులచే చెప్పినట్లు చేయించవచ్చు. కానీ పిల్లలు ఆడుకునే జీవంలేని బంతి చెప్పినమాట వింటుందంటే ఆశ్చర్యంగానే ఉంటుంది. కానీ ఇది మేజిక్‌లో సాధ్యమవుతుంది. మెజీషియన్ ఒక మామూలు పిల్లలు ఆడుకునే బంతిని, ఒక మీటరు పొడుగువున్న తాడుని ముందుగా ప్రేక్షకులకు చూపిస్తాడు. ఆ బంతికి పై నుండి క్రింద దాకా ఒక రంధ్రం ఉంటుంది. ఈ తాడు ఒక చివరి భాగాన్ని ఆ రంధ్రంగుండా పోనిచ్చి, దానిని ఎడమచేతితో పట్టుకొని రెండవ చివరను కుడిచేత్తో పట్టుకుంటాడు. అంటే ఇపుడు బంతి ఆ తాడుమీద ఆధారపడి వుంది. పిదప కుడిచేతిని తాడుతో సహా పైకెత్తుతాడు. వెంటనే బంతి క్రిందకి వస్తుంది. అదేవిధంగా ఎడమచెయ్యి పైకెత్తినపుడు బంతి క్రిందకు వస్తుంది.





ఈ విధంగా ఆ బంతిని పై నుంచి క్రిందకు నాలుగైదుసార్లు తిప్పి ప్రేక్షకులకు ఇందులో ఏ మర్మమూ లేదని రుజువు చేసిన తరువాత కుడిచేయిని పైకి ఎత్తుతాడు. మామూలుగా బంతి క్రిందకు వస్తూండగా అతను "స్టాప్" అంటాడు. ఆశ్చర్యం! బంతి క్రిందకు వస్తూ మధ్యలో ఆగిపోతుంది. ప్రేక్షకులకు ఎంతో ఆశ్చర్యం కలుగుతుంది.

మళ్ళీ 'ప్రొసీడ్' అనగానే క్రిందకు దిగుతుంది. అదే ప్రకారంగా మెజీషియ ఆజ్ఞానుసారం ఆగమన్నప్పుడు ఆగి, దిగమన్నప్పుడు దిగి, ప్రేక్షకులకు ఆశ్చర్యా కలిగిస్తుంది. ఒకవేళ ప్రేక్షకులు ఇది చేద్దామని ప్రయత్నిస్తే మాత్రం విఫలులౌతార

ఇందులో ముఖ్యపాత్ర వహించి అమాయకంగా కనబడే ఈ బంతి, నిజం మామూలు బంతి కాదు. అది ఒక చెక్కతో చేసిన బంతి. రహస్యం అం ఇందులోనే వుంది. ఇది మీరుకూడా చేయించుకోవచ్చు. ఇందులో ఉండే రంధ్ర మామూలుగా పై నుండి క్రిందకు తిన్నగా ఉండదు. కొద్దిగా వంకరగా ఉంటుంది కాని పై రంధ్రం, కింద రంధ్రం యొక్క చివరలు చూస్తే రంధ్రము తిన్నగ ఉన్నట్లుగా కనబడుతుంది. కానీ మధ్యలో చిన్న వంపు ఉంటుంది. అది పై కనబడదు.

ఈ విధంగా చేసిన బంతికి అందంగా రంగులు వేసి దానిలో తాడును దూర్చి రెండు చేతులతో రెండు చివరలూ పట్టుకొని మీరు మామూలుగా బంతిని పై నుండి క్రిందకు ప్రయాణం చేయించవచ్చు. మీరు 'స్టాప్' అన్నప్పుడు మాత్రం మీ చేతిలోనున్న తాడు చివరలను 'బిగువు' చెయ్యండి. వెంటనే బంతి ఎక్కడ వున్నది అక్కడ ఆగిపోతుంది. బంతిలో నున్న వంపువలన ఇలా ఆగిపోతుంది. మళ్ళీ 'ప్రొసీడ్' అన్నప్పుడు తాడు చివరలను మామూలుగా వదులుగా పట్టుకుంటే బంతి క్రిందకు వచ్చేస్తుంది.

*జోసఫ్ జైనో అనే మరుగుజ్జు మెజీషియన్ ఎత్తు రెండడుగులే. జర్మనీలో అతను ఇంద్రజాల రంగంలో చరిత్ర సృష్టించాడు. ఆత్మవిశ్వాసంతో పైకి వచ్చాడు.*



# పేకముక్కని నిలబెట్టండి

భరతనాట్యంలో పళ్ళెంమీద నిలబడి నృత్యం చేయటం అందరికీ తెలిసిందే. అలాగే ఇంద్రజాలంలో కూడా అలాంటి అంశాలున్నాయి. ఒక మామూలు పేకముక్కను ఇంద్రజాలికుడు ప్రేక్షకులకు పరీక్షకు ఇచ్చి తరువాత దానిని బల్లమీద అతి జాగ్రత్తగా నిలువుగా పడకుండా నిలపెడతాడు. అంతేకాదు, ఒక గాజుగ్లాసును దాని అంచుమీద నిలబెట్టి ఆ గ్లాసులో ఎత్తునుండి నీరు పోస్తాడు. అసలు ఒక పేకముక్కను మామూలుగా నిలబెట్టడమే అతికష్టం. ఇంక దానిమీద ఒక గ్లాసుపెట్టి అందులో నీరు పోయడమంటే విచిత్రంగా ఉండదూ!

ఈ ప్రదర్శనలో మీ యొక్క హస్తలాఘవాన్ని ప్రదర్శించాలి. ఇందులో మీరు నిలబెట్టిన కార్డు మామూలుదికాదు. దానివెనుక నిలువుగా మడిచిన మరొక కార్డుయొక్క సగభాగం జిగురుతో అంటించాలి. మిగతా సగం కార్డు నిలబడడానికి సహాయపడుతుంది. అంటే పై నుండి చూస్తే ఇంగ్లీషు అక్షరమైన "టి" ఆకారంలో ఉంటుంది. ఇప్పుడు మీరు తయారు చేసుకున్న కార్డు మీ కోటు జేబులో ఉంటుంది. ఉదాహరణకు అది ఇస్పేటు ఆసు అనుకుందాం.



ఇప్పుడు మరొక మామూలు ఇస్పేటు ఆసును తీసుకొని అది ప్రేక్షకులకు పరీక్షకియ్యాలి. ప్రేక్షకులు మామూలుగా జాగ్రత్తగా పరీక్షించి 'ఓకే' అని తిరిగి ఇస్తారు. అది మీరు తీసుకొని స్టేజిమీదకు వచ్చే సమయంలో తెలివిగా ఈ కార్డును మీ జేబులో వేసుకొని తయారుచేసిన కార్డును బయటకు తీయాలి. ఇది చాకచక్యంగా చేయాలి. స్టేజిమీద కొచ్చి ఈకార్డును ప్రేక్షకులకు చూపించి జాగ్రత్తగా మామూలు కార్డు బేలన్సు చేస్తున్నట్లుగా రెండు నిముషాలు నటిస్తూ జాగ్రత్తగా వెనుకనున్న కార్డును తెరచి వుంచాలి. అపుడు మామూలుగా కార్డు నిలబడుతుంది. ముందునున్న వారు ఆ ముక్క మాత్రమే నిలబడిందనుకుంటారు.

ఇప్పుడు భరతనాట్యం గురించి చెప్పి ఒక గ్లాసును తీసుకొని, ఈ నిలబెట్టిన కార్డు మీద జాగ్రత్తగా ఉంచండి. కార్డు పడిపోతున్నట్లు నటించండి. కాని, మీరు ఒక కేజీ బరువు పెట్టినా అది పడదు. ఇపుడు ఆ గ్లాసులో నీళ్ళుపోసి చూపండి. ప్రదర్శనానంతరం ఈ కార్డును వెంటనే తీసి జేబులో పెట్టుకోండి? ఎవరైనా మళ్ళీ పరీక్ష చేస్తానంటే అసలు కార్డుతీసి వారికియ్యండి. ఈ అయిటమ్ ప్రదర్శించేముందు స్టేజిమీద మీ అసిస్టెంట్లు తప్ప ప్రేక్షకులెవరూ లేకుండా చూసుకోండి.

> సాధారణంగా పుస్తకాలలో రాసే అంశాలు చాలా సులభతరంగాను, చేయడానికి వీలుగా ఉండేవే ఉంటాయి. కానీ సాధనవలన మనం ఎన్నో మార్పులు, కూర్పులు చేసి రాసిన రచయిత కూడా ఆశ్చర్యపోయేలాగ ప్రదర్శించవచ్చు.



# మాట్లాడే పేకముక్కలు

కొంతమంది మెజీషియన్లు కళ్ళకు గంతలు కట్టుకొని పేకముక్కలను ముట్టుకొని అవి ఏయే కార్డులో చెబుతుంటారు. కాని, పేకముక్కల శబ్దం విని, ఏ ముక్కలో చెప్పడం మేజిక్‌ల్లో మరో క్రొత్త ప్రయోగం. ఇది మీరు కూడా జాగ్రత్తగా చేసి ప్రదర్శనను రక్తి కట్టించవచ్చు.

ప్రేక్షకులు పరీక్ష చేసిన పేకను మెజీషియన్ బాగా కలిపి, ప్రేక్షకులలో చురుగ్గావున్న ఒకరికి ఇచ్చి ఆ పేకను పక్కనున్న గదిలోనికి తీసుకొని వెళ్ళి నాణాలతో బొమ్మాబొరుసు ఆట ఆడినట్లుగా ఒక పేక ముక్కను బొటన వేలితో కొట్టి పైకి ఎగురవేయమని చెప్తాడు. అది కిందపడిన తరువాత ఆ ముక్కను తీసి మళ్ళీ యధాప్రకారం పేకలో ఉంచి పేకను కలిపి తనకు ఇవ్వవలసిందిగా మెజీషియన్ కోరుతాడు. ఒక ప్రేక్షకుడు ఆ ప్రకారం చేసి ఇస్తాడు. మెజీషియన్ ఆ పేకను తీసుకొని ప్రేక్షకుడు పేకముక్కలతో చేసిన శబ్దం ద్వారా అతను సెలక్టు చేసిన పేకముక్కను చెప్తానని చెప్పి తాను కూడా పేకను బాగా కలిపి దానిని తన కెదురుగా వుంచి ఏదో మాట్లాడతాడు. తరవాత ఆ పేకను చెవివద్ద ఉంచుకొని ఏదో వింటున్నట్టుగా ఊఁ కొడతాడు. రెండు మూడు నిముషాల తర్వాత ప్రేక్షకుడి పేకముక్క ఏదో అందరికీ చెప్తాడు.



ఈ అంశాన్ని ఏదో అతీతశక్తివల్ల చేయగలిగినట్లుగా నమ్మించవచ్చు. అసిస్టెంటు అవసరంలేదు. అతను పక్కగదిలోకి వెళ్ళినపుడు అవసరమైతే మనం కళ్ళకు గంతలుకూడా కట్టుకోవచ్చు. పేకముక్కల మేజిక్‌లలో ఇది చాలా విలువైనది.

ఈ అంశంలోని అసలు కిటుకు మనం ప్రదర్శించిన పేకకు వెనుకవైపున్న డిజైనులో వుంది. ఈ పేకను ముందుగా ఒక క్రమంలో అమర్చుకోవాలి. దీనికి కొన్ని డిజైనులుగల పేకలు మాత్రమే పనికి వస్తాయి. ఉదాహరణకు పేక వెనుకవైపు రెండు కొంగలు వున్నాయనుకోండి. ఇపుడు మీరు కొంగ తలలన్నీ ఒకేవైపునకు ఉండేలా పేర్చుకోవాలి. ఒక పేకముక్క తల్లక్రిందులయినా మన ప్రదర్శన దెబ్బతింటుంది.

మీరు పేకను సక్రమంగా ఏర్పాటుచేసి ప్రేక్షకులలో ఒకరికి ఇచ్చి వారిని పక్కగదిలోనికి వెళ్ళి ఏదో ఒక ఒక ముక్కను తీసుకొని చప్పుడుచేసి క్రింద పడవేయమని చెప్పండి. తరువాత వారు ఆ ముక్కను తీసి మళ్ళీ పేకలో వుంచేటప్పుడు తప్పకుండా వారికి తెలియకుండా డిజైనును తలక్రిందులుగా వుంచుతారు. తరువాత పేకను మామూలుగా కలిపి ఇస్తారు. అపుడు మీరా పేకను తీసుకొని ఒకసారి వెనక్కి తిరిగి ఆ పేక వెనుకగల డిజైనులను త్వరగా చూసి వారి ముక్కను గుర్తుపెట్టుకోండి. తర్వాత ముందు కాసేపు పేకతో ఏదో మాట్లాడి ఆ తర్వాత చెవిదగ్గర పెట్టుకొని ఏదో వింటున్నట్లు నాటకమాడి ఆ ముక్క ఏమిటో అందరికీ చెప్పండి.

ఈ అంశాన్ని ప్రదర్శించటంలో ఎప్పుడో నూటికొక్కసారి ప్రేక్షకునికి తెలియకుండా పేకముక్కను తల్లక్రిందులుగా కాక మామూలుగా మిగతా డిజైన్లతో కలిసేలా పెట్టవచ్చు. అటువంటి సమయాలలో - ప్రేక్షకుడు పేకముక్కను శబ్దం సరిగా వచ్చేలా చేయలేక పోయాడనీ, కాబట్టి మళ్ళీ ఇంకొకసారి గదిలోకి వెళ్ళి మరోముక్క చూసుకోమనీ చెప్పండి. అప్పుడుకూడా దెబ్బతిన్నారనుకోండి, నవ్వుతూ వేరే అంశంలోకి వెళ్ళండి. ప్రేక్షకులు కలిపేటప్పుడు కత్తెర వెయ్యకూడదని చెప్పాలి.



# పేక ముక్కలతో పతాకావిష్కరణ

జాతీయ పర్వదినాలలో ప్రదర్శన చేయవలసివస్తే బాగుండే అంశం ఒకటుంది. కొన్ని అంశాలు చేసిన తరువాత ప్రేక్షకులతో "ఈ రోజు స్వాతంత్ర్య దినోత్సవం కాబట్టి దేశానికి సంబంధించిన అంశం ఒకటి ప్రదర్శిస్తున్నాను" అని చెప్పి, అక్కడ ఉన్న ఒక పేకను తీసి అందరి ఎదురుగా కలిపి ప్రేక్షకులలో ఎవరో ఒకరిని వారి టోపీ ఇమ్మని అడిగి ఆ పేకను మరోసారి కలిపి టోపీలో వుంచి, దేశభక్తి పూరితంగా నాలుగు మాటలు చెప్పి పేకను పైకి తీయబోతాడు. కాని బయటకు వచ్చినది పేక కాదు - అది మన జాతీయ పతాకం.

మరి పేక ఏమయినట్లు? ఇందులో హస్త లాఘవం ప్రయోగించలేదు. అసిస్టెంట్ అవసరంలేదు. టోపీ యజమాని కూడా మెజీషియన్‌కు అపరిచితుడూ. జండాను ముందుగా చేతులలోగాని, కోటు లోపలకాని దాచుకోనవసరం లేదు. ఒకవేళ జండాను సృష్టించగలిగినా, ఏభైరెండు పేక ముక్కలను మాయం చేయడం సామాన్య విషయం కాదు.

ఇందులోని అసలు మాయ అంతా మెజీషియన్ ప్రదర్శించే పేకలోనే వుంది. ఈ పేకను ముందుగా తయారుచేసుకోవాలి. ముందుగా 45 పేకముక్కలను తీసుకొని వాటి మధ్యలో కొంతభాగం కత్తిరించి, ప్రతి ముక్కనూ 'యు' ఆకారం వచ్చేలా చేసుకొని వాటిని ఒకదానిమీద ఒకటి జిగురుతో అతికించాలి. ఆ విధంగా అన్ని ముక్కలనూ ఒకదానిమీద మరొకటి అతికించిన తరువాత మరొక రెండు మామూలు ముక్కలను తీసుకొని, ఈ అతికించిన కట్టకు పైనొకటీ, కింద ఒకటీ అతికించాలి. అంటే ఇపుడొక పెట్టెలాగ తయారయిందన్న మాట. మూడు వైపులనుండి చూస్తే మామూలు పేకలాగా, ఒకవైపు నుండి చూస్తే సంచీలాగ కనబడుతుంది.

ఇపుడొక చిన్న సిల్కు జాతీయ పతాకాన్ని తీసుకొని, దాని వెనుక వైపు ఒక చిన్న దారాన్ని కట్టి, దారం రెండవ కొసని పేకకట్ట లోపలి భాగంలో గట్టిగా అతికించాలి. జాతీయ పతాకాన్ని బాగా మడిచి, పేక పెట్టెలోనికి అమర్చివేయాలి. తరువాత ప్రదర్శన ప్రారంభించేముందు మిగిలివున్న పేకముక్కలను కూడా తీసుకొని, ఈ పేకతోబాటు కలిపి, ప్రేక్షకుల నుండి టోపీని అడిగి తీసుకోవాలి.



పేకను మరొకసారి కలుపుతూ, ప్రేక్షకులకు అనుమానం రాకుండా అందులోని విడిముక్కలను యధాలాపంగా క్రింద పడేయండి. దానివలన ఆ పేకలోనివన్నీ విడిముక్కలని ప్రేక్షకులు భావిస్తారు. మీ చేతిలోని కట్టను టోపీలో వుంచి, తరువాత ప్రేక్షకులు గమనించకుండా పేకలో నుండి జండాను బయటకు తీసి దాని దారంతో ముడివేసి ఉండడం వలన పేకకట్ట జండా వెనుకభాగంలో వుండిపోతుంది. అది ముందునుండి చూసేవారికి కనబడదు. తరువాత జండాను అలాగే అసిస్టెంటుకి ఇచ్చేసి టోపీని యజమానికి ఇచ్చేయండి. మీ అసిస్టెంటును వెనుకకు తిరగకుండా అలాగే జండాను లోపలికి తీసుకుపొమ్మని ముందుగానే చెప్పి ఉంచండి. ఈ అంశాన్ని జాతీయ పర్వదినాల్లో చేస్తే బాగా రక్తి కడుతుంది. మిగిలినరోజుల్లో జండాకు బదులు ఆడవారి చేతిరుమాలును కాని, విశ్రాంతి అని రాసివున్న వస్త్రాన్ని కాని సృష్టించవచ్చు.



# మీరూ యోగ విద్యను ప్రదర్శించండి

దాదాపు పదిహేనేళ్ళ క్రితం ఒక మహాయోగీశ్వరుడు కాకినాడ వచ్చాడు. ఊరంతా ఆయన చాలా గొప్పవాడని చెప్పుకున్నారు. ఆయన యోగమహిమల వల్ల భక్తుల ప్రశ్నలకు సమాధానం చెప్తాడని అంతా అనుకునేవారు యోగీశ్వరుడు పులిచర్మంమీద ధ్యాననిమగ్నుడై కూర్చుని ఉండగా ఆయన శిష్యుడు వచ్చి అక్కడున్న వారందరికీ అన్నీ ఒకే సైజులో ఉన్న తెల్లకాగితాలు ఇచ్చి వారు అడగబోయే ప్రశ్నలను ఆ కాగితాలపై రాయమని చెప్పేవాడు. ప్రశ్నలు రాయటం అయ్యాక వారందరికీ ఒక్కొక్క కవరు ఇచ్చి కాగితాలను ఆ కవర్లలో ఉంచి కవర్లను జిగురుతో అతికించమని చెప్పేవాడు. ప్రతివారూ తాము వ్రాసిన ప్రశ్నలను ఎవరూ చూడకుండా కవరులో ఉంచి కవరును అతికించేవారు. శిష్యుడు ఒక పళ్ళెం తీసుకువచ్చి అందరి కవర్లనూ వుంచిన ఆ పళ్ళాన్ని గురువుగారి ముందుంచి నమస్కారం చేసేవాడు.




యోగి కళ్ళు తెరిచి ఒకసారి అందరినీ దీవించి పళ్ళాన్ని తన ఒడిలో ఉంచుకొని ఏవో మంత్రాలు చదివేవాడు.

అపుడు శిష్యుడు ఆయనకొక పెన్సిలును ఇచ్చి, తరువాత ఓ పెద్ద శాలువని ఆయనమీద పూర్తిగా కప్పేవాడు. అంటే లోపలికి ఏమాత్రమూ వెలుగు కనపడకుండా మూసి శాలువను తొలగించి, అందర్నీ మరోసారి దీవించి పళ్ళాన్ని శిష్యుడి కిచ్చేవాడు. శిష్యుడు ఎవరి కవర్లను వారికిస్తాడు. కవరుపైన ఒకవైపు వారి ప్రశ్నకు సమాధానం రాసి ఉండేది. కవరు సీలువేసినది వేసినట్లే ఉండేది. విప్పిన దాఖలాలు ఉండేవికావు. మరి ఆ యోగి ఆ ప్రశ్నలను ఎలా చదివినట్లు? ఇది కేవలం యోగమహిమ తప్ప మరేమీ కాదని అందరూ ఏకగ్రీవంగా నిశ్చయించి ఆ యోగికి పాద పూజలూ వగైరాలు చేసేవారు.

మీరు కూడా ఎవరి సహాయమూ అవసరం లేకుండా అలాంటి యోగ విద్యను ప్రదర్శించవచ్చు. ప్రశ్నలు రాసిన వాళ్ళందరూ మనకు అపరిచితులు అయినా ఫరవాలేదు. ఈ అంశం చేయడానికి ముందుగా మీరు ఒక బ్యాటరీ లైటును ఎవరికీ కనబడకుండా చొక్కాలోపల దాచుకుని యోగిలా కూర్చోవాలి. తరువాత కవర్లను తీసుకుని ఎవరిచేతనైనా మీ చుట్టూ శాలువని కప్పించుకోండి. ఆ తరువాత మీరు బ్యాటరీ లైటును వెలిగించి ఒక్కొక్క కవరును ఆ లైటు వెలుగులో ఉంచండి. ఆ వెలుగులో వారు వ్రాసిన ప్రశ్నలు కనబడతాయి. వెంటనే లైటు ఆర్పి ఆ కవరుమీద మీకు తోచిన జవాబు రాయండి.

జవాబు మధ్యస్తంగా ఉండాలిసుమా!. ఉదాహరణకు "మా అమ్మాయికి పెళ్ళి ఎప్పుడు అవుతుంది? " లాంటి ప్రశ్నలకు "త్వరలోనే అయ్యే అవకాశం ఉంది" అని రాయాలి. కవర్లు కొంచెం పలుచని కాగితంతో చేసినవైతే ప్రదర్శన బాగా రక్తికడుతుంది. భక్తులు పేపరుమీద ప్రశ్నరాసిన తరువాత, ఆ పేపరును మడవకుండా కవరులో పెట్టాలని చెప్పడం మర్చిపోవద్దు.



# దివ్య దృష్టి ప్రదర్శించండి

"ఇది థాట్ రీడింగ్‌ని మించిన సూపర్‌థాట్ రీడింగ్' అని ముందుగా మీరు ప్రేక్షకులను బాగా నమ్మించాలి. ఇపుడు మీరు టేబుల్ మీదనున్న దినపత్రికను తీసి ప్రేక్షకులలో ఒకరిని స్టేజిమీదకు పిలిచి ఇవ్వండి. అది ఆనాటి పత్రిక మాత్రమే అయి ఉండాలి. దానితో బాటే ఒక కత్తెరను కూడా వారికి ఇచ్చి "డియర్ ఫ్రెండ్, ఈ పేపరును మీరు, మీ యిష్టం వచ్చిన రీతిలో రెండుసార్లు మడిచి ఆ మడిచిన చివరను కత్తిరించి, కత్తిరించిన భాగములను నాకు ఇవ్వండి" అనాలి. అనగా మళ్ళీ పేపరు విప్పితే డైమండ్ షేపులో కట్ అయి ఉండాలి. వారు ఏ పక్కనైనా కత్తిరించవచ్చు కానీ పూర్తి పేపరును కత్తిరించాలి. ఈ విధంగా కత్తిరించిన ముక్కలలో వారు ఒక ముక్కను దగ్గర ఉంచుకుని, మిగతా ముక్కలను మీకు ఇచ్చేయాలి. మీరు ఒక కొవ్వొత్తి వెలిగించి వారి ఎదురుగా ఒక్కొక్క ముక్కను చూస్తూ మనసులో ఏదో స్మరిస్తూ అన్నీ కాల్చేయాలి.



తరువాత ఒక నిముషం ఆలోచించి వారి వద్ద మిగిలి ఉన్న ముక్కలో ఏ వార్తలున్నాయో అన్నీ ఒకదానివెంట ఒకటి చెబుతారు. చూసేవాళ్ళకు ఇదేదో దివ్యదృష్టి కన్నా మించిన విద్యలాగ అనిపిస్తుంది.

ఈ ప్రదర్శన చేయడానికి మీరు రెండు పత్రికలను సంపాదించాలి. (ఆనాటి పత్రికలు మాత్రమే) రెండవ పత్రికను మొదటి పత్రిక మధ్యలో ఉంచాలి. అంటే మామూలుగా 4 పేజీలుంటే ఇప్పుడు 8 పేజీలుంటాయి. అనగా ప్రతి పేపరూ రెండేసి ప్రతులుంటాయి. యీ ప్రకారంగా పేపరు అమర్చి ప్రేక్షకుల నుండి ఒకరిని పిలిచి ఇవ్వండి. ఇచ్చి వారిని పూర్తి పేపరును రెండుసార్లు మడిచి కట్‌చేసి, కట్ చేసిన ముక్కలలో ఒక ముక్క వారివద్దనుంచుకోమని, మిగతా 7 ముక్కలనూ మీకు ఇచ్చేయమనాలి. అంటే వారు మీకు ఒకే మేటరు ఉండే 4 జతల ముక్కలు కాక ఒక సింగిల్ ముక్కను (దీని డూప్లికేటు వారి వద్ద ఉంది) ఇస్తారు. మీరు కొవ్వొత్తిని వెలిగించి ఏదో మంత్రిస్తున్నట్లుగా నటిస్తూ ఈ ముక్కలను జాగ్రత్తగా చూడండి. రెండేసి ఉన్న ముక్కలను కాల్చేయండి. ఒకటి ఉన్న దానిని మాత్రం జాగ్రత్తగా నటిస్తూ పూర్తిగా అటూ ఇటూ చదివేయండి. అది అలా చదివిన పిదప దానిని కూడా కాల్చేయండి.

ఇపుడు మీరు ఏదో ఆలోచిస్తున్నట్లుగా నటించి ఆ మేటరు చెప్పండి. వాళ్ళ దగ్గరున్న ముక్కల్లో కరక్టుగా అదే మేటరు ఉంటుంది. ఈ అయిటమ్ చేసేటప్పుడు ముఖ్యంగా కొన్ని విషయాలు గమనించాలి. కట్ చేయగా మిగిలిన పేపరును అక్కడ పడేయవద్దు. ఎవ్వరైనా అది చూశారంటే మీ మోసం బయట పడిపోతుంది. మీరు ఆ రోజు పేపరే ఉపయోగించడం వలన వారికి మీరు వార్తలను బట్టీపట్టారేమో అనే ఆలోచన కూడా రాదు. పాత పేపరయితే వారికి అనుమానం రావచ్చు. ఒక వేళ 8 పేపర్లు కట్ చేయలేకపోతే 4 పేపర్లు ఉండచ్చు. అనగా రెండు జతలు ఉండాలి. కానీ చాలా జాగ్రత్తగా చేయవలసిన అయిటం ఇది.



## ఆఫీసరుగారి పెన్సిల్

ఎలాంటి మెజీషియన్ అయినా ఒక్కో సమయంలో ఎవరైనా ఏదైనా అంశాన్ని ప్రదర్శించమన్నప్పుడు, సరయిన సరంజామా లేకపోతే ఏమీ చేయలేడు, ఇరుకులో పడిపోతాడు. ఒకసారి నాకు ఇలాగే ఇబ్బంది కలిగింది. కానీ తెలివిగా తప్పించుకున్నాను. నేనొకసారి ఒక ఉద్యోగానికి ఇంటర్వ్యూకి వెళ్ళాను. వాళ్ళు రకరకాల ప్రశ్నలడిగారు. రూపాయినోటుకు, పది రూపాయల నోటుకు గల తొమ్మిది తేడాలను చెప్పమన్నారు. చెప్పాను. ఇంకా ఇలాంటివే ఎన్నో తెలివైన ప్రశ్నలడిగారు. చాలామటుకు సరిగానే జవాబు చెప్పాను. అన్నీ అయిన తర్వాత "సరే నీ హాబీలు ఏమిటి?" అన్నారు. వెంటనే 'మేజిక్' అన్నాను. వారు ఉత్సాహంగా "ఏదీ ఒక మేజిక్‌చేసి చూపించు" అన్నారు.



కానీ ఆ సమయానికి నావద్ద ఎటువంటి సరంజామా లేదు. ఏం చెయ్యాలా అని ఆలోచిస్తూ నా ఎదురుగా కూర్చుని పెన్సిలుతో ఏదో రాసుకుంటున్న ఒక ఆఫీసరును చూడగానే నాకు మంచి ఆలోచన వచ్చింది. వెంటనే ఆయనతో "సార్! మీరేమనుకోకపోతే మీ పెన్సిలు ఒకసారి ఇస్తారా?" అని అడిగి తీసుకొని, ఆ పెన్సిల్‌ను ఎడమచేతితో పైకి కనిపించేలా పట్టుకొని, చేతిని, పెన్సిలును నా దగ్గర ఉన్న జేబురుమాలుతో మూసి

ఉంచాను. తరువాత ఒన్ టూ త్రీ అని పైనున్న రుమాలును తీసేశాను. అంతే! అక్కడ పెన్సిలు లేదు. మాయమయింది. వెంటనే రుమాలును వారికి పరీక్షకు యిచ్చాను. అందరూ సంతోషించారు. నాకు పెన్సిలు యిచ్చిన ఆఫీసరు నవ్వుతూ ఆఫీస్‌బోయ్‌ని పిలిచి మరో పెన్సిలు తీసుకురమ్మన్నారు. "ఇంకో పెన్సిలు ఎందుకండీ. ఇదిగో మీ పెన్సిలు" అంటూ ఆ పెన్సిలును నా జేబులోంచి తీసి ఇచ్చాను. అక్కడున్న ఆఫీసర్లు మరోసారి ఆశ్చర్యపోయారు. ఆ తరువాత వాళ్ళు నాకు ఉద్యోగం ఇచ్చారనుకోండి. అది వేరే విషయం.

యీ ప్రదర్శన చేసేటప్పుడు తప్పనిసరిగా కోటు ఉండాలి. ప్రేక్షకుల నుండి పెన్సిలును తీసుకొని దానిని ఎడమచేతి వ్రేళ్ళతో పట్టుకొని ఒక జేబు రుమాలును పెన్సిలు కనబడకుండా చేతిమీద వేయాలి. అంటే పెన్సిలు మీద జేబురుమాలు ఉన్నప్పటికీ ప్రేక్షకులకు పెన్సిలు చేతిలో ఉన్నట్లు తెలియాలి. తరువాత మీరు తెలివిగా పెన్సిలును కోటు చేతిలోనికి జారవిడిచి, ఎడమచేతి చూపుడు వేలును పెన్సిలు స్థానంలో పైకి ఎత్తండి.

ఈ రెండుపనులూ ఒకేసారి జరగాలి. చూసేవారికి మాత్రం జేబు రుమాలు అడ్డం ఉండటంవల్ల మీ చూపుడువేలును పెన్సిలుగా భావిస్తారు. అపుడు జేబురుమాలును తీసేసి పరీక్షకిచ్చి రెండు చేతులూ ఖాళీగా చూపండి. తరువాత జాగ్రత్తగా పెన్సిలును ఎడమవైపు జేబులో జేర్చండి. ఆ తరువాత ఆ పెన్సిలును తిరిగి సొంతదారుకు యిచ్చేయండి.



# ప్రేక్షకులకు టోపీ వేయండి

మెజీషియన్ ఒక ఖాళీ టోపీని, ఒక ఖాళీ ఐస్‌క్రీం కప్పును ప్రేక్షకులకు చూపించి, తానిపుడు ఒక పెద్ద వింతను చేయబోతున్నానని, ఇది ప్రపంచంలో 8వ వింత అనీ చిన్న ఉపన్యాసం ఇస్తాడు. తరువాత ఒక కూల్‌డ్రింక్ సీసా మూతను తెరచి, తాను కొంచెం తాగి, ప్రేక్షకులతో "ఇప్పుడు ఐస్‌క్రీం కప్పును టోపీలో పెట్టి, అందులో ఈ కూల్ డ్రింకును పోసి, తిరిగి అందులోంచి ఐస్‌క్రీం తెప్పిస్తానని" చెప్తాడు. తరువాత కప్పును టోపీలో పెట్టడం మర్చిపోయి కూల్‌డ్రింగ్ టోపీలో పోసేస్తాడు. ప్రేక్షకులందరూ చప్పట్లు కొడుతూ మెజీషియన్ పొరపాటు చేసినందుకు వేళాకోళం చేస్తారు.

మెజీషియన్ కూడా తప్పు జరిగిపోయినందుకు బాధపడి, టోపీ ప్రక్కనున్న ఖాళీకప్పును తీసి టోపీలో పెడతాడు. మేజిక్‌కర్రను మూడు సార్లు టోపీ మీద తిప్పి, టోపీలోని కప్పును బయటకు తీస్తాడు. దాని నిండా అంతకుముందు పోసిన కూల్‌డ్రింక్ వుంటుంది. తరువాత మెజీషియన్ టోపీని పరీక్షిస్తాడు. ఎక్కడా తడిసినట్లు కూడా కనబడదు.



ఇందులో ఉన్న టోపీ మామూలుదే కాని రహస్యమంతా కప్పులో వుంది. ఈ అంశంలో ప్రదర్శించినవి రెండు కప్పులు. ఒక కప్పుకు అడుగుభాగం ఉండదు. అడుగులేని కప్పును రెండవ కప్పులో వుంచి టోపీ ప్రక్కన వుంచి ప్రదర్శనకు సిద్ధం కావాలి. ఐస్‌క్రీం కప్పులు కాబట్టి కప్పులో కప్పువున్నా ప్రేక్షకులకు అనుమానం రాదు. ఇపుడు తాను ఈ కప్పును టోపీలో వుంచి ఐస్‌క్రీం చేస్తానని చెప్తూ రెండు కప్పులు టోపీలో వుంచుతాడు. ఉపన్యాసం అయిపోయాక కప్పుని తీసి, టోపి ప్రక్కనపెడతాడు. కానీ ఇపుడు బయటకు తీసి, టోపీ ప్రక్కన పెడతాడు. కానీ ఇపుడు బయటకు తీసిన కప్పు నిజంది కాదు. అది 'అడుగు' లేని కప్పు. అసలు కప్పు టోపీలోనే ఉండిపోయింది.

ఇపుడు కూల్‌డ్రింగ్ సీసాను తెరిచి టోపీలో వున్న కప్పులో పొయ్యాలి. చూసేవారు మాత్రం ఖాళీ టోపీలో పోశారనుకుంటారు. తరువాత ప్రక్కన ఉన్న 'అడుగు' లేని కప్పును టోపీలో ఉన్న కప్పులో ఉంచాలి. ఇపుడు రెండు కప్పులను ఒకే కప్పులా ప్రేక్షకులకు చూపించి, లోపలి కప్పులోని కూల్‌డ్రింక్‌ను బయట పారబోసి, టోపీలో డ్రింక్ తాలూకు తడిలేదని ప్రేక్షకులకు చూపించి ప్రేక్షకులకు టోపీ వెయ్యండి.

కప్పులు అట్టతో చేసినవి కనుక డ్రింకు పోసిన తరువాత ఎక్కువసేపు వుంచవద్దు. డ్రింకు టోపీలోకి కారిపోయే ప్రమాదం ఉంటుంది. కప్పులను రేకుతో చేయించుకొన్న పక్షంలో అలాంటి ఇబ్బంది ఉండదు. అలాగే అడుగులేని కప్పును మీరు ప్రదర్శనలో ఉపయోగిస్తున్నట్లు ప్రేక్షకులకు తెలియకుండా కూడా జాగ్రత్త పడాలి. ఐస్‌క్రీం గురించి ఎవరైనా అల్లరిచేస్తే ఏవో కబుర్లు చెప్పి తప్పించుకోండి.





# రూపాయి గోవిందా?

కేరళలోని ఒక గ్రామంలో కోరికలు తీర్చే గుడి ఉంది. భక్తులు ఆ గుడికి వచ్చి కొంత హారతి కర్పూరం దేవుని ముందు ఉంచి, తమ కోర్కెలను విన్నవించి బయటకువస్తారు. ఐదు నిముషాలలో మళ్ళీ లోపలికి వెళ్తారు. అక్కడ వారు ఉంచిన కర్పూరం మాయమయితే తమ కోరిక తప్పక నెరవేరుతుందని అక్కడి ప్రజల నమ్మకం. సాధారణంగా కర్పూరం మాయమవుతూనే ఉంటుంది. గుడిలోపల పూజారులుండరు. ఇది ఎలా సాధ్యమవుతున్నదో ఇప్పటికీ అంతు తెలియని రహస్యంగానే ఉండి పోయిందిట.



"ఆ కర్పూరం మాట ఎలా ఉన్నా, అంతకన్నా గమ్మత్తుగా కళ్ళ ముందే మనం వుంచిన వస్తువు మాయమయ్యే అంశాన్ని మీ ముందు ప్రదర్శిస్తాను" అని మెజీషియన్ ప్రేక్షకులతో చెప్పి, అక్కడ వున్న ఒక వారపత్రిక ముఖచిత్రం వున్న పేజీని చింపి అందరికీ రెండువైపులా చూపించి దానిని ఒక మిఠాయి పొట్లంలా చుడతాడు. అందులో అందరూ చూస్తుండగా ఒక రూపాయి నాణాన్ని వేసి తన మేజిక్ కర్రతో పొట్లంమీద రెండు మూడుసార్లు తిప్పి పొట్లాన్ని విప్పుతాడు.

పొట్లంలో నాణెం ఉండదు. ఆ కాగితాన్ని పూర్తిగా విప్పి రెండు వైపులా చూపిస్తాడు. తన చేతులలో కూడా నాణెం లేదని నిరూపిస్తాడు. మేజిక్ కర్రను కూడా పరీక్షకు ఇస్తాడు. నాణాన్ని చొక్కా మడతలో దాచుకోవలసిన అవసరంలేదు. అసిస్టెంటు సహాయపడనక్కరలేదు. హస్త లాఘవాన్ని ప్రయోగించలేదు. రూపాయి "గోవిందా".

ఇందులో ప్రదర్శించే నాణెమూ, మేజిక్ కర్రా మామూలువే. కాగితం మాత్రం అసలైనది కాదు. దీనిని మీరు తయారుచేసుకోవాలి. ముందుగా ఒకే వారం పత్రికలను రెండు సంపాదించాలి. వాటి ముఖ చిత్రాలను జాగ్రత్తగా చింపి, అందులో ఒక దానిపైన కొంత ఏటవాలుగా కత్తిరించి, పైభాగం తీసేసి, క్రింది భాగాన్ని రెండవ దానిమీద పూర్తిగా జిగురు వ్రాయకుండా అంచులలో మాత్రమే జిగురు వ్రాసి అతికించాలి. అతికించేటప్పుడు పై భాగంలో ఒక అంగుళం మేరకు జిగురు అతికించకుండా ఖాళీగా వుంచాలి. ఇప్పుడు అది కాగితం సంచీలాగ తయారవుతుందన్నమాట. అతికించేటప్పుడు చాలా జాగ్రత్తగా బొమ్మలో తేడా కనపడకుండా అంటించాలి. దూరంనుంచి చూస్తే ఒకే కాగితంలా కనబడాలి. తరువాత దాన్ని పత్రికకు మామూలుగా కుట్టేయవచ్చు.

ప్రేక్షకుల ఎదుట పత్రిక నుంచి ముఖచిత్రం ఊడతీసి, కాగితాన్ని అటూ ఇటూ చూపించి మిఠాయి పొట్లంలాగ చుట్టి ప్రదర్శన ప్రారంభించండి. ప్రేక్షకులలో ఒకరి దగ్గర రూపాయి నాణెం తీసుకొని, జాగ్రత్తగా పొట్లంలో వేస్తున్నట్టుగా అంగుళం మేర ఖాళీ వున్న భాగంలోనికి వదలండి. అది రెండు కాగితాలమధ్య సంచీలా ఉన్న భాగంలోనికి వెళ్ళిపోతుంది.

ఇప్పుడు పొట్లాన్ని విప్పి చూపండి. నాణెం కనబడదు. ఇంక కథ మామూలే. ముఖచిత్రాన్ని మాత్రం ప్రేక్షకులకు పరీక్షకు ఈయవద్దు.



# రామబాణం

మెజీషియన్ తాను చేయబోయే ప్రదర్శనలో ప్రతి అంశం తన వద్దనున్న మేజిక్‌కర్ర ఆధారంగానే చేయగలుగుతున్నాననీ, ఆ కర్రలో ఎన్నో మహత్తులు ఉన్నాయనీ చెప్పి తన జేబులోనుండి మేజిక్ కర్రను తీసి ప్రేక్షకులకు చూపిస్తాడు. అది తన గురువుగారు బహూకరించారని చెప్పి, ఆ కర్రను బల్లమీద కొట్టి, అది చెక్కతో చేసినదేననీ అందులో ఎటువంటి మాయాలేదనీ నిరూపించి దానిని ఒక పేపరులో చుట్టి పట్టుకొని హ్రాం హ్రీం అని, వెంటనే ఆ కాగితాన్ని అందరూ చూస్తుండగా మడిచి ఉండలా నలిపి ముక్కలు ముక్కలుగా చింపేస్తాడు. అందులో కర్ర మాయమయింది.

ఆ తరువాత మెజీషియన్ ప్రేక్షకులతో తన మేజిక్ కర్ర శ్రీరామచంద్రుడి రామబాణం వంటిదని, ఎక్కడకు పోయినా మళ్ళీ వచ్చేస్తుందని చెప్పి, ఏవో మంత్రాలు చదివి అందరూ చూస్తుండగానే తన కోటు జేబులోనుండి మేజిక్ కర్రను తీసి చూపించి, ప్రేక్షకులకు పరీక్షకిచ్చి వారిని సంభ్రమాశ్చర్యాలలో ముంచుతాడు. ఇందులోని పేపరులో ఎటువంటి మాయా లేదు. ఇది కేవలం తాను అందరి కనులకు కనికట్టు చేశానని, అసలు తాను ముందుగా చూపిన కర్రను అసలు కాగితంలో ఉంచనే లేదనీ చెప్పి మాట మారుస్తాడు.



ఈ రామబాణం మేజిక్ చేయడానికి మీకు రెండు మేజిక్ కర్రలు కావాలి. ఒక్కొక్కటి అడుగున్నర పొడవుంటే సరిపోతుంది. ఇందులో మొదటిది మామూలు కర్రే కానీ రెండవదానిలో కొంత మర్మం ఉంది. ఇది

నిజంగా కర్రతో చేసినది కాదు. నల్ల డ్రాయింగు పేపరుతో చేసిన పేపరుగొట్టం. కానీ దానికి రెండు చివరలలోనూ ఒక్కొక్క అంగుళం పొడుగు ఉండే చెక్క ముక్కలను మేజిక్ కర్ర పరిమాణంలో చేయించి ఉంచుకోవాలి. వాటి మీద డ్రాయింగ్ పేపరు చుట్టి ఉండటం వలన అవి కనపబడవు. ఇపుడు అసలైన మేజిక్‌కర్రను, తయారు చేసిన కర్రను, కోటు లోపలి జేబులో ఉంచుకొని ప్రదర్శనను ప్రారంభించాలి.

ముందుగా జేబులోనుండి కాగితం మేజిక్ కర్రను తీసి ప్రేక్షకులకు కర్ర మహత్తు గురించి వివరించి, అది పూర్తిగా చెక్కతో తయారుచేసినదని చెప్పి, టేబులు మీద కొట్టి చూపిస్తాడు. చివర్లలో ఉన్న చెక్కముక్కవల్ల శబ్దం వచ్చి ప్రేక్షకులు అది పూర్తిగా చెక్కదే అని భావిస్తారు.

ఇపుడు దానిని అక్కడే ఉన్న ఒక కాగితంలో ఉంచి ఏవో మంత్రాలు చదివినట్లుగా నటించి నలిపి చింపివేయండి. లోపల ఉన్నది పేపరుగొట్టమే కనుక వెంటనే చిరిగిపోతుంది.

తరువాత తాను చేసినది కనికట్టు అనీ అసలు కర్ర జేబులోనే ఉందనీ చెప్పి జేబులోని కర్రను తీసి ప్రేక్షకులకు పరీక్ష కివ్వండి.

చిన్నమాట - మీరు కాగితాన్ని చింపి పడవేసిన తరువాత మీ అసిస్టెంటు ఆ ముక్కలను ఏరి లోపలికి తీసుకొని వెళ్ళకపోతే ఎవరైనా ప్రేక్షకుడు వాటిని పరిశీలించే ప్రమాదం ఉంది. అదే కనుక జరిగితే రహస్యం బయటపడే అవకాశం ఉంది. ఈ విషయంలో జాగ్రత్తగా ఉండాలి.



# దెయ్యం రాతలు

విజయవాడలో మాకు తెలిసిన వారి ఇంటిని దయ్యం ఆవహించిందని అందరూ చెప్పుకుంటుంటే ఒకసారి చూద్దామని నేను వెళ్ళాను. అక్కడ విచిత్రమేమిటంటే, వాళ్ళ పడకగది గోడ బయట తెల్లారేసరికి ఏవో రాతలు ప్రత్యక్షమయ్యేవి. ఆ రాతల్లో ముఖ్యంగా "మీ అల్లుడు కులదైవానికి ఇష్టుడు - అతనిని బాధ పెడితే మీకు కష్టాలు తప్పవు. అతను కోరినవన్నీ ఇవ్వండి" అని ఎక్కువగా ఉండేది. ఒకటి రెండు రోజులుచూసి ఆ తరువాత, రాత్రి పడుకునేముందు వాళ్ళు గోడలకు శుభ్రంగా వెల్ల వేయించి పడుకునేవారు. ఉదయం అయ్యేసరికి తాటికాయంత అక్షరాలతో మళ్ళీ రాతలు ప్రత్యక్షమయ్యేవి.

దాంతో వాళ్ళు భయపడిపోయి భూతవైద్యులను పిలిపిస్తే, వాళ్ళు ఏదో ధూపం వేసి, ఆ ఇంటిని ఏదో దెయ్యం ఆవహించిందనీ దానిని తరిమివేయాలంటే ఐదువేల రూపాయల దాకా ఖర్చు అవుతుందనీ తేల్చారు. చివరికి ఇంటివారు ఆ డబ్బును ఇచ్చి పీడ విరగడ చేసుకుందామను కుంటుండగా ఆ మాయ ఇంటి అల్లుడే చేశాడని తెలిసిపోయింది.



అటువంటి దెయ్యాలు రాశాయనిపించే రాతను మీరుకూడా ప్రత్యక్షం చేయగల విధానంగా ఒక అంశాన్ని మీకు చూపిస్తాను" అని మెజీషియన్ చెప్పి, పిల్లలు స్కూలుకు తీసుకెళ్ళే ఒక పలకను తీసి ప్రేక్షకులకు చూపిస్తాడు. అది రెండు వైపులా ఖాళీగా వుంటుంది. ఏమీ రాసి ఉండదు.

అపుడు మెజీషియన్ ఆ పలకను సరిగ్గా ఆ పలక పట్టే అంత కాగితం సంచీలో పెట్టి, ఆ సంచీ మీద సుద్దముక్కను ఉంచి, ఏదో స్మరించి, తాను దెయ్యాన్ని ఆ పలకమీద ఏదో ఒకవాక్యాన్ని రాయమని కోరాననీ, ఆ దయ్యం సరేనని చెప్పిందనీ చెప్పి వెంటనే ఆ సంచీలోని పలకను తీసి ప్రేక్షకులకు చూపిస్తాడు. దానిమీద 'అందరికీ అభివందనాలు' అని ఉంటుంది. మెజీషియన్ ఆ పలకను పరీక్షకిస్తాడు. కాగితం సంచీ గురించి కూడా వారికి అనుమానం లేకుండా దానిని వెంటనే వారి ఎదురుగా నలిపి, కింద పడవేసి, కేవలం దెయ్యం రాసిన రాత మాత్రమే అని చెప్పి మరో అంశం ప్రారంభిస్తాడు.

ఈ ప్రదర్శనకు మీరొక మామూలు పలకను సంపాదించాలి. తరువాత ఒక నల్లరంగు డ్రాయింగు పేపరును తీసుకొని, పలకకు ఒక వైపున రాసే భాగం ఎంత వుందో సరిగ్గా ఆ సైజులో కత్తిరించి ఉంచుకోవాలి. తర్వాత పలకను తీసుకొని దానిమీద 'అందరికీ అభివందనాలు' అని రాసి దాని మీద మీరు కత్తిరించి ఉంచిన నల్ల డ్రాయింగు పేపరును ఉంచండి. దానివల్ల మీరు రాసినది మరుగైపోతుంది. కానీ దూరం నుండి చూసే వాళ్ళకు ఆ కాగితంకూడా పలకకు సంబంధించిన రాసే భాగం మాదిరిగానే కనబడుతుంది. అపుడు మీరొక మామూలు కాగితం సంచీని తీసుకుని ప్రదర్శన ప్రారంభించండి.

ముందుగా దెయ్యాల కథ చెప్పి, కాగితంతో సహా పలకతీసి రెండు వైపులా చూపించి, దెయ్యం ద్వారా ఏ రాతలైనా రాయిస్తానని చెప్పి, ఆ పలకను అందరి ఎదురుగా సంచీలో ఉంచి వెంటనే పలకను బయటకు తీయండి. ఇక్కడ మీరు జాగ్రత్తగా నల్ల డ్రాయింగు పేపరును సంచీలో వదిలేసి, కేవలం పలకను మాత్రమే బయటకు తీసి, దానిమీద అదివరకే మీరు రాసి వుంచుకున్న రాతలను ప్రేక్షకులకు చూపండి. ఇకపోతే వారికి కాగితం సంచీపై అనుమానం రాకుండా వెంటనే ఆ సంచీని, దానిలో మీరు వదలి వేసిన నల్ల డ్రాయింగు పేపరుతో సహా నలిపి ఉండలాగా చేసి మూల పడేయండి. మీ అసిస్టెంటు ఆ ఉండను స్టేజిపై లేకుండా చేసేలా, ముందే జాగ్రత్త పడండి. పోతే, అందరికీ వందనాలు అని రాస్తే ప్రారంభ అంశంగానూ, 'విశ్రాంతి' అని రాసుకుంటే 'ఇంటర్వెల్' ముందు చేయవలసిన అంశంగానూ లేదా 'గుడ్‌బై' అని ఆఖరి అంశంగానూ ప్రదర్శిస్తే రక్తి కడుతుంది.



# అబ్రకదబ్రా

"సాధారణంగా పురాణాల్లోనూ, మత గ్రంథాల్లోనూ, ఆయా పాత్రలు చేసే పనులను మహత్యాలుగా భావిస్తూ ఉంటాం. ముఖ్యంగా పురాణపురుషుడు సాధారణంగా చేసే అంశం - గాలిలో ఇలా చెయ్యి తిప్పి కావలసిన వస్తువును ప్రత్యక్షం చేయడం. ఇప్పుడు నేను కూడా మీకు అదే అంశాన్ని చేసి చూపిస్తాను. కానీ నేను ఈ అంశం చెయ్యటానికి మేజిక్ కర్రను ఉపయోగించాలి. ఈ మేజిక్ కర్ర సహాయంతో నాకు కావలసినది సృష్టించుకోగలను అని మెజీషియన్ చెప్పి, మేజిక్‌కర్రను తీసి ప్రేక్షకులకు పరీక్షకిస్తాడు. వారు పరీక్ష చేసిన తరువాత దానిని టేబులుపై ఉంచి ప్రేక్షకులలో ఒక స్త్రీని స్టేజిమీదకు ఆహ్వానిస్తాడు.

వారు వచ్చాక మేజిక్ కర్రను చేత్తో పట్టుకొని "ఈ మేజిక్ కర్రను, నేపాల్ దేశానికి చెందిన ఒక మాంత్రికుడు నాకు బహుమతిగా ఇచ్చాడు. దీనిని పురాణాల్లో చెప్పబడే కల్పవృక్షానికి చెందిన కొమ్మతో తయారుచేశారు. దీనితో మీరు ఏం కావాలన్నా నేను సృష్టిస్తాను!" అని చెప్పి ఆ ప్రేక్షకురాలితో "మీకేం కావాలి చెప్పండి. పువ్వులా? సిగరెట్లా'' అని అడుగుతాడు. అక్కడున్న స్త్రీ తప్పకుండా పువ్వులే కావాలంటుంది. వెంటనే మెజీషియన్ చేతిలో ఉన్న కర్రను ఒకసారి గాలిలో తిప్పి "అబ్రకదబ్రా అబ్రకదబ్రా" అని అరుస్తాడు. అంతే! మరుక్షణం ఒక చక్కని గులాబిపువ్వు మేజిక్ కర్ర చివరిలో



ప్రత్యక్షం అవుతుంది మెజీషియన్ ఆ పువ్వును తెంపి ఆమెకు ఇచ్చి కిందకు పంపించేస్తాడు.

ఈ అంశం ప్రదర్శించాడానికి రెండు మేజిక్ కర్రలు కావాలని మీరీపాటికి గ్రహించే ఉంటారు. మొదటది మాములు మేజిక్ కర్ర. రెండవది చెక్కతో చేసిన కర్ర కాదు. అది ఒక ఇనుప గొట్టం. నీటి కుళాయిలకు ఉపయోగించే పైపును వాడవచ్చు. సరిగా మేజిక్ కర్ర సైజులో ఉండే పైపుగొట్టాన్ని తీసుకొని, దానికి అందంగా నల్లరంగును వేసి, ఒకవైపు చెక్కతో మూసేయలి.

ఇప్పుడు ఒక రబ్బరుబేండును తీసుకొని, దానిని కత్తిరిస్తే అది ఒక దారంలా అవుతుంది. ఇప్పుడీ రబ్బరుదారానికి చెందిన ఒక చివరను, పైపులోపలి రెండవ చివరవున్న చెక్కకు ముడివేసి, రబ్బరు దారము రెండవ కొనను బయటకు సాగదీసి దానికొక గులాబి పువ్వును కట్టాలి. తరువాత రబ్బరును మరింతగా సాగదీసి పువ్వును పైపుతో సహా అరచేతిలో పట్టుకొని ఉండాలి. పువ్వును వదులుచేస్తే అది తక్షణం పైపు ముందు భాగంలో ప్రత్యక్షం అవుతుంది. పైపు వ్యాసం కంటే పువ్వు పరిమాణం పెద్దది కనుక అది దానిలోకి పోలేదు. ప్రదర్శన ప్రారంభించి ముందుగా ఒక మామూలు కర్రను పరీక్షకిచ్చిన తరువాత కర్రను తెలివిగా మార్చి పైపును బయటపెట్టండి. ఆమెతో మీకు సిగరెట్టు కావాలా? పువ్వులు కావాలా? అని అడగండి. ఆ వచ్చినది స్త్రీ కనుక ఆమె తప్పక పువ్వులే కావాలంటారు.

ఒకవేళ వారు కొంటెగా సిగరెట్లు కావాలని అంటే మీరు కంగారు పడకుండా నవ్వేసి, మీరు అడిగినా సిగరెట్లు ఇవ్వటం ఇక్కడ భావ్యం కాదు అని ఏదో మాట మార్చి పువ్వును సృష్టించి దానిని తెంపి ఇవ్వండి. తరువాత ఆ పైపును అసిస్టెంటుకు ఇచ్చి లోపలికి పంపించేయండి. ఈ అంశాన్ని పెళ్ళిళ్ళు, పుట్టినరోజు పార్టీల లోనూ, స్త్రీలు ఎక్కువగా ఉన్న ప్రదేశాలలోనూ ప్రదర్శిస్తే బాగా రక్తికడుతుంది.



# ఇ.ఎస్.పి.

కొన్ని రకాల అతీంద్రియశక్తులను కలిగి వుండటాన్ని 'ఎక్స్‌ట్రా సెన్సరీ పెర్‌సెప్షన్' (ఇ.ఎస్.పి.) అంటారు. జరగబోయే విషయాలను ముందుగానే చెప్పగలగడం, ఎక్కడో దూరంగా ఉన్న వ్యక్తులు అక్కడ ఏం చేస్తున్నారో తెలుసుకోవడం ఈ ఇ.ఎస్.పి.లో ఒక భాగం. ఇలాంటి శక్తులు సంక్రమించడానికి గల కారణాలను తెలుసుకొనడానికి విదేశాల్లోని సైంటిస్టులు ఇప్పుడు విశేషంగా కృషి చేస్తున్నారు.

ఇ.ఎస్.పి.కి సంబంధించిన అంశాన్ని ఇప్పుడు ప్రదర్శిస్తానని ప్రేక్షకులతో చెప్పి అసిస్టెంటును స్టేజిమీదకు పిలుస్తాడు. అతనికి పుట్టుకతోనే అతీంద్రియ శక్తులు అలవడ్డాయనీ, ప్రక్కగదిలో కూర్చునే ఇక్కడ వున్న వ్యక్తులు ఏంచేస్తున్నారో తన అసిస్టెంటు గ్రహించగలడనీ చెప్పి అతడిని ప్రక్క గదిలోనికి పంపిస్తాడు.

తరువాత పోస్టుకార్డు సైజులో వున్న మూడు వేరు వేరు బొమ్మలను ప్రేక్షకులకు చూపించి, వారిలో ఒకరిని స్టేజిమీదకు ఆహ్వానిస్తాడు మెజీషియన్. ఆ వచ్చిన వారిని అక్కడ వున్న మూడు బొమ్మలలో ఒక దానిని ఎన్నుకోమని చెప్తాడు. మొదటి కార్డుపై పిల్లి, రెండవ దానిపై కుక్క, మూడవ దానిపై ఎలుక బొమ్మలుంటాయి. ప్రేక్షకుడు ఆ మూడింటిలో ఒకదానిని ఎంచుకొని ఆ బొమ్మను అందరికీ చూపిస్తాడు.



అప్పుడు టేబులుపై గల క్లిప్పువున్న అట్టకు తెల్లకాగితాన్ని తగిలించి బొమ్మను ఎన్నుకొన్న వారి చేతనే అట్టనూ, తెల్లకాగితాన్నీ అసిస్టెంటుకు పంపుతాడు. అసిస్టెంటు ఆ ప్రేక్షకుని కళ్ళవైపు ఒకసారి తీక్షణంగా చూసి, అట్టకు తగిలించి వున్న కాగితంపై ఆయన ఎంచుకున్న బొమ్మను గీయడమో, పేరు రాయడమో చేస్తాడు. ఇందులో మెజీషియన్ పంపిన అట్టమీద కాని, కాగితంమీద కాని ఆ బొమ్మ గురించి రాయలేదు. ప్రేక్షకుడు కూడా మెజీషియన్‌కు సంబంధించిన వ్యక్తి కాదు.

తెలివిగలవారు ఈ అంశంలోని రహస్యాన్ని తేలిగ్గానే గ్రహించవచ్చు ప్రేక్షకుడు తీసుకువెళ్ళిన అట్ట ద్వారా మెజీషియన్ తన అసిస్టెంటుకు రహస్య సంకేతం పంపుతాడు.

అట్టమీద కాగితాన్ని ఎడమవైపు వుంచితే, ప్రేక్షకుడు మొదటి బొమ్మను ఎంచుకున్నాడని అర్థం. అంటే పిల్లి బొమ్మ అన్నమాట.

కాగితాన్ని కుడివైపు వుంచితే రెండవ బొమ్మ అయిన కుక్కను,

మధ్యగా వుంచితే మూడవ బొమ్మగా ఉన్న ఎలుకను ఎంచుకున్నారని అసిస్టెంటు తెలుసుకుంటాడు.

ఆ ప్రకారం అతను ఆ బొమ్మను తెల్లకాగితంపై గీస్తాడు. అతనికి డ్రాయింగు చేతకాని పక్షంలో ఫలానా బొమ్మను ఎంచుకున్నారని రాస్తాడు. ఈ అంశాన్ని ఎన్నిసార్లయినా చేయవచ్చు పిల్లి, కుక్క, ఎలుకబొమ్మలు లభించని పక్షంలో మరేరకం బొమ్మలనైనా ఉపయోగించవచ్చు. అయితే అసలు రహస్యాన్ని మెజీషియన్ అతని అసిస్టెంటు మరిచిపోకూడదు.



# కాగితం మరమరాలు

రంగుకాగితాలతో చక్కని పువ్వులు, జండాలు, తోరణాలు లాంటివి ఎన్నో చేసుకోవచ్చు. కానీ రంగు కాగితాలతో మరమరాలు చేయగలిగేది మెజీషియన్ మాత్రమే.

ముందుగా ఒక టోపీని ప్రేక్షకులకు పరీక్షకిచ్చి తరువాత దానిని టేబులుపైన ఉంచండి. మీరొక రుమాలును జేబులోంచి తీసి, రెండువైపులా చూపించి అవసరమనుకుంటే గాలిలో దులిపి చూపించి, దానిని టోపీలో ఉంచండి. తరువాత కొన్ని రంగు కాగితాలను తీసుకొని వాటిని చిన్నచిన్న ముక్కలుగా చింపి అందరూ చూస్తుండగా వాటిని టోపీలో వున్న రుమాలు మధ్యలోవుంచి, కొన్ని మంత్రాలను మనసులోనే చదువుకొని మేజిక్ కర్రను మూడు నాలుగుసార్లు టోపీ చుట్టూ తిప్పి రుమాలును బయటకు తీసి దానిని గట్టిగా ఒకసారి గాలిలోకి దులపండి. రుమాలునుండి రంగు కాగితాలకు బదులు మరమరాలు బయటకు వస్తాయి. ఒక్క రంగు కాగితం ముక్కకూడా కనబడదు.



వెంటనే మీరు రుమాలును దులిపి, రెండు వైపులా, చూపించవచ్చు. అంతేకాదు, ఆ టోపీని కూడా వెంటనే పరీక్షకియ్యవచ్చు. ఈ అంశం చేయడానికి మీకు హస్తలాఘవంతో పనిలేదు. అసిస్టెంట్ అవసరం లేదు. టోపీలో కూడా ఏ మాయా లేదు.

ఈ మేజిక్ చేయడానికి ఉపయోగించిన రుమాలులోనే అసలు మాయ అంతావుంది. ఆ రుమాలును మీరు ముందుగా కుట్టించుకోవాలి. ఒకే డిజైనులోవుండే రెండు రుమాళ్ళను ఒకదానిపై ఒకటి ఉంచి చుట్టూ బోర్డరుమీద కుట్టు వేయించాలి. అదే సమయంలో రుమాలు పై భాగంలోనూ కిందిభాగంలోనూ జేబులు మాదిరిగా కుట్టించి బోర్డరు నుండి ఏవైనా వేయడానికి దారి ఉండేలా చేసుకోవాలి.

ప్రదర్శన ప్రారంభించేముందు రుమాలుకువున్న ఒక జేబులో కొన్ని మరమరాలు వేసి ఆ జేబుకు వున్న అంచులను జాగ్రత్తగా పట్టుకొని దానిని అటూ ఇటూ చూపించి, ఓసారి గాలిలోకి దులిపి టోపీలో ఉంచాలి. తరువాత రంగు కాగితాలను చింపి టోపీలోని రుమాలులో వేస్తున్నట్లుగా రుమాలుకువున్న రెండవ జేబులో వేయండి. మేజిక్‌కర్రను టోపీ చుట్టూ తిప్పి టోపీలోని రుమాలును బయటకు తీయండి.

ఇప్పుడు జాగ్రత్తగా రంగుకాగితాలున్న జేబుపైకి వచ్చేలా దాని చివరలు పట్టుకొని పైకెత్తి గాలిలోకి దులపండి. ఈ దశలో మరమరాలు వున్న జేబు కింద వుంటుంది. దానిని దులిపినప్పుడు మరమరాలు బయటపడ్తాయి. తరువాత రుమాలును అటూ ఇటూ కూడా చూపించవచ్చు. కానీ ఓ విషయం మీరు రుమాలు జేబులలో సరుకును కొంత తగ్గించి వేయడం మంచిది. లేకపోతే రుమాలు మధ్యలో ఉబ్బినట్లుగా కనపడే ప్రమాదం ఉంది.

*మేజిక్ షోలో దైవదూషణకు, వ్యక్తి దూషణకు దిగటంవలన ఒక వర్గానికి చెందిన ప్రేక్షకులకు అసంతృప్తి కలుగుతుంది. మనం చేసే ప్రదర్శనలు వినోదం కొరకేగానీ విమర్శ చేయడానికి కాదని గుర్తు పెట్టుకోండి.*



# కంట తడిపెట్టించిన ఉంగరం

నా చిన్నతనంలో ఒకసారి మా స్కూలు ముందు ఒక పాములవాడు ఏదో మేజిక్కులు చేస్తూంటే కొందరు స్నేహితులతో కలిసి చూడటానికి వెళ్ళాను. పాములవాడు రంగుకాగితాలు తినేసి మళ్ళీ వాటిని నోటినుంచి రప్పించాడు. బకెట్ నీళ్ళు తాగి వాటిని మళ్ళీ బయటకు రప్పించాడు. తరువాత మాలో ఎవరినైనా ఒక ఉంగరం ఇమ్మన్నాడు. మా స్నేహితుడొకడు ఉంగరం ఇచ్చాడు దానిని ఆ పాములవాడు ఒక రుమాలులో ఉంచి, ఆ రుమాలుతో సహా ఉంగరాన్ని నన్ను పట్టుకోమని ఇచ్చి అందులో ఉంగరం ఉందో లేదో చూడమన్నాడు. నేను రుమాలు పట్టుకొని చూస్తే ఉంగరం అందులోనే ఉంది. తరువాత నన్ను 'హ్రీం' అనమన్నాడు అన్నాను. 'క్లీం' అనమన్నాడు - అన్నాను. వెంటనే ఆ రుమాలును కింద పడేయమన్నాడు. నేను అలాగే చేశాను. తరువాత అతను రుమాలును తీసి దులిపితే ఏముంది? ఉంగరం గోవిందా. ఉంగరం పోయినందుకు మావాడు కంట తడిబెట్టి ఏడవబోయాడు.



అపుడు ఆ పాముల వాడు ఒక కమలాఫలాన్ని తీసుకొచ్చి, రెండు చేతులను ఖాళీగా చూపించి తరువాత ఏదో మంత్రం చదివి, పండును మధ్యకు విడగొట్టాడు.

మాయమైన ఉంగరం పండు మధ్యలో వుంది. ఉంగరం మాయమై క్షణం కూడా కాలేదు. పండులోకి ఎలా వచ్చింది? అసలు ఎలా మాయమయిందో ఎలా వచ్చిందో నాకు అంతుబట్టలేదు. "ఇంతకీ అదెలా సాధ్యపడింది" అని ఒక మెజీషియన్‌ను మా మిత్రుడు అడిగాడు.

"ఈ అంశం ప్రదర్శించడానికి మీరు ఒక ప్రత్యేకమైన రుమాలును కుట్టించుకోవాలి. రుమాలుకు నాలుగువైపులా అంచుకట్టాలి. దానికి ఉన్న నాలుగు మూలల్లోనూ ఒక మూల వున్న అంచును పనికిరాని ఉంగరాన్ని ఉంచి కుట్టేయాలి. మామూలుగా రుమాలును చూస్తే ఆ అంచులలో ఉంగరం ఉన్నట్లుగా కనబడదు. అప్పుడు ప్రదర్శన ప్రారంభిస్తూ ప్రేక్షకులనుంచి ఒక ఉంగరాన్ని తీసుకొని దానిని రుమాలు మధ్యలో ఉంచుతున్నట్లుగా నటిస్తూ మెల్లగా దానిని అతని కోటు స్లీవులోనికి జారవిడిచి, పాత ఉంగరం వున్న రుమాలు అంచును మధ్యలో వుంచి, ప్రేక్షకులలో ఒకరికి ఇచ్చి పట్టుకొని ఉంగరం ఉందో లేదో పరీక్ష చేయమని చెప్పాలి.

వారు రుమాలును పట్టుకొని చూసి ఉంగరం అక్కడే ఉందని అంటారు. ఈలోగా మీరు ప్రేక్షకుల వద్దనుంచి తీసుకొని మీ కోటులోనికి పంపిన ఉంగరాన్ని మీ అసిస్టెంటు వద్ద జారవిడిచి ప్రేక్షకులవైపు తిరిగి మీరు రుమాలు వ్యక్తితో మంత్రాలు ఉచ్చరించమని చెప్పాలి. ఆ సమయంలో మీ అసిస్టెంటు ఒక కమలాఫలాన్ని తీసుకొని దానిపై భాగంలో సన్నగా బ్లేడుతో కత్తిరించి, దానిలోనికి ప్రేక్షకులు ఇచ్చిన ఉంగరాన్ని పంపించి పండును మెజీషయన్ పక్కనే ఉంచుతాడు. పండుతొక్క చేతితో తీయకుండా బ్లేడుతో కోయటం వల్ల ఆ కమలాఫలంపై ప్రేక్షకులకు అనుమానం రాదు. తరువాత రుమాలు పట్టుకున్న వారితో ఆ రుమాలు కింద పడేయమని చెప్పండి. దానిని వారు పడేసిన వెంటనే ఆ రుమాలును తీసి గాలిలోకి విదిల్చి, ఉంగరం మాయమయినట్లుగా అందరిచేత ఒప్పించండి. ఆ తరువాత కమలాఫలాన్ని తీసుకొని, దానిని రెండుగా విడగొట్టి అందులోని ఉంగరాన్ని తీసి దాని యజమానికి ఇచ్చేయండి" అని చెప్పాడు.



# అగ్గిపెట్టె వినయం

రామచిలుకకు చక్కగా మాట్లాడటం నేర్పచ్చు. కానీ అసలు జీవమే లేని జడపదార్థాలు మనం చెప్పినట్లు వినేలా చేయడం పూర్తిగా అసాధ్యం. మేజిక్‌లో మాత్రం అలాంటివి సాధ్యమే. మెజీషియన్‌లు మాత్రమే జీవంలేని వస్తువులను ఎవరి ప్రేమయం లేకుండా కదిలించగలరు, ఎగిరేలా చేయగలరు, పలికించగలరు.

ఒకసారి స్నేహితులతో మాట్లాడుతుండగా ఇలాంటి శక్తులపై సంభాషణ మళ్ళింది. వారిలో ఒకరు అక్కడున్న ఒక అగ్గిపెట్టెను చూపించి "నిజంగా మీరు వస్తువులను చెప్పినమాట వినేలా చేయగలిగితే ఈ అగ్గిపెట్టెచేత ఆ పని చేయించండి. అగ్గిపెట్టె మార్చకూడదు" అన్నాడు. సరే అని ఆ పెట్టె తీసుకొని, అందులోని పుల్లలన్నింటిని బయటకు తీసి లోపలి గుల్ల భాగానికి పైనుండి కిందిదాకా దారాన్ని ఎక్కించి, మళ్ళీ ఈ గుల్లను పుల్లలతో నింపేసి అగ్గిపెట్టె కవరులో వుండే విధంగా యథాస్థితిలో వుంచాను. దారం రెండు చివరలను రెండు చేతులతో పట్టుకొని ఒక చెయ్యిని పైకి ఎత్తితే అగ్గిపెట్టె కిందకు జారింది. తర్వాత రెండో చెయ్యిని పైకిఎత్తితే అగ్గిపెట్టె మళ్ళీ కిందకు జారింది. ఇంతవరకూ మామూలే. ఎవరైనా చేయగలరు. కానీ అగ్గిపెట్టె కిందకు జారుతున్నపుడు 'స్టాప్' అనగానే అగ్గిపెట్టె మధ్యలో



ఆగిపోయింది. మరి సాధ్యమేనా? మళ్ళీ 'ప్రొసీడ్' అనగానే మళ్ళీ కిందకు జారింది. ఆ మహిమ 'స్టాప్... ప్రొసీడ్' అనే ఇంగ్లీషు మాటలలో ఉందనీ, మీరు కూడా లయబద్ధంగా పలికితే అగ్గిపెట్టె చెప్పినట్లు వింటుందనీ చెప్పి ఆ అగ్గిపెట్టెను పక్కన పెట్టేశాను.

ఈ అంశాన్ని మీరు కూడా ఎక్కడ పడితే అక్కడ ఏ అగ్గి పెట్టెతోనైనా చేయవచ్చు కాని అసలు మాయ - అగ్గిపెట్టె గుల్లకు దారం ఎక్కించిన తరువాత పుల్లలు వేయటం దగ్గర ఉంది. పుల్లలను గుల్లలో యథాస్థితిలో ఉంచేముందు మరోపుల్లను కొంత విరిచి గుల్లలో వున్న దారంపైన అడ్డంగా ఉంచాలి. ఆ తరువాత ఆ పుల్లమీదే మిగతా పుల్లలను మామూలుగా వేసి గుల్లను అగ్గిపెట్టెలో ఉంచాలి. మీరు రెండుచేతులతో దారం కొసలు పట్టుకొని అగ్గిపెట్టెను కిందకు జారేలా చేయొచ్చు కానీ జారుతుండగా మీరు 'స్టాప్' అన్నప్పుడు మాత్రం, రెండు చేతులలోని దారాలను కొంచెం బిగువు చేస్తూ లాగిపట్టుకుంటే, ఎక్కడున్న అగ్గిపెట్టె అక్కడే ఆగిపోతుంది. మళ్ళీ వదులుచేస్తే మామూలుగా దిగిపోతుంది. కాకపోతే గుల్లలో దారంపై అడ్డంగా అగ్గిపుల్లను విరిచి ఉంచినట్లు ఎవరూ చూడకుండా జాగ్రత్త పడండి.

> *ఒక మెజీషియన్ స్టేజిపై ప్రదర్శన ఇస్తున్నప్పుడు ఎట్టి పరిస్థితుల్లోనూ మరో మెజీషియన్‌ను ఛాలెంజి చెయ్యకూడదు. అతనికి సైతం ఆ పరిస్థితి రావచ్చు.*
>
> *- ప్రొ. కాల్‌నాగ్*



# బిస్కెట్లలో నాణాలు

ఓసారి కొందరు మెజీషియన్లు జూపార్కుకు పిక్నిక్‌కి వెళ్ళినపుడు, ఒక్కొక్కరూ ఒక్కొక్క మేజిక్‌ను ప్రదర్శించారు. ప్రొ॥ బి.వి.ఎస్. నగేష్ తన వంతు వచ్చినపుడు ఒకరినుండి ఒక పావలా కాసును తీసుకొని దానిని ఒక జేబురుమాలులో ఉంచి, ఒక ప్రేక్షకుడిని రుమాలును పట్టుకోమని చెప్పాడు. తరువాత ఆ రుమాలును తీసుకొని వెంటనే దులిపి 'హుష్' అన్నాడు. అంతే పావలా మాయమయింది. తరువాత పిక్నిక్‌లో తినడానికి తెచ్చుకున్న కొత్త క్రీంబిస్కట్ పేకెట్‌ను ఒక బాబు దగ్గర్నుంచి తీసుకుని ప్రేక్షకుడికిచ్చి అందులోంచి ఒక క్రీం బిస్కెట్‌ను తీసుకోమన్నాడు. క్రీం బిస్కట్ అంటే రెండు బిస్కట్‌ల మధ్యలో క్రీం ఉంటుంది. వారు ఆ బిస్కట్ విడదీసి చూస్తే అందులో పావలా కాసు ఉంది.

ఇందులో మెజీషియన్ ఏదైనా హస్తలాఘవం ప్రదర్శించాడా అంటే అసలు బిస్కట్ పేకెట్‌నే అతను తాకలేదు. బిస్కట్‌ను రెండుగా విడగొట్టి అందులో వున్న ఒక్క పావలాకాసును ఉంచిన బిస్కట్‌ను ఎంచుకున్నదీ ప్రేక్షకుడే, దానిని విడదీసి







చూసినదీ ప్రేక్షకుడే. ఆ ప్రేక్షకుడు మెజీషియన్ అసిస్టెంటు ఎంతమాత్రము కాదు. పైగా ముందు మాయమయిన నాణెం ఏ సంవత్సరంలో తయారైనది బిస్కట్‌లో కనిపించిన నాణెం కూడా అదే.

ఈ అంశం చేయడానికి ముందుగా మీరు ఒకే సంవత్సరంలో తయారైన పావలా కాసులను దాదాపు 20 సంపాదించాలి. తరువాత క్రీం బిస్కట్ పేకెట్‌ను కొని పాకెట్‌ను చింపకుండా జాగ్రత్తగా విప్పి అందులోని ఒక్కో బిస్కెట్‌ను జామ్ లాంటిది రాస్తే అవి అతుక్కుపోతాయి. తిరిగి వాటిని జాగ్రత్తగా పేకెట్‌లో ఉంచేసి, జిగురుతో పేకెట్‌ను అతికించేసి ప్రేక్షకులలో మనవారైన ఒకరి దగ్గర ఉంచాలి. ఇకపోతే మరొకరి దగ్గర మన పావలాను వుంచి వారిని అడిగినప్పుడు ఇవ్వమనిచెప్పాలి. ఇక అసలు మాయ రుమాలులో ఉంది. ఆ రుమాలును కూడా ముందుగా మనం సిద్ధం చేయాలి. ఒక పావలాకాసును తీసుకొని దానిని రుమాలుకున్న అంచులో ఒక మూల కుట్టించాలి. ఇది మామూలుగా బయట నుంచి చూస్తే కనబడదు.

ఇక ప్రదర్శన ప్రారంభించేముందు రుమాలును పట్టుకొని రెండు వైపులా చూపించి ప్రేక్షకులనుండి పావలా కాసును తీసుకొని దానిని రుమాలు మధ్యలో ఉంచుతున్నట్లుగా నటిస్తూ రుమాలును రెండు చేతులతోనూ పట్టుకొని తెలివిగా పావలాను ఎడమచేతి కోటు స్లీవులోనికి వదిలేయాలి. అనంతరం రుమాలును ప్రేక్షకులలో ఒకరికి ఇచ్చి నాణాన్ని రుమాలు మధ్యలో ఉంచి ఇవ్వాలి. వారు నిజంగా పావలా పట్టుకున్నామనుకుంటారు.

ఆ తరువాత ఆ రుమాలును మీరు తీసుకుని కుడిచేత్తే ఒక్కసారి దులపాలి. అప్పుడు చూసేవారికి నాణెం మాయమయినట్లు కనబడుతుంది. ఆ తరువాత బిస్కట్ పేకెట్‌ను తీసుకొని మిగతా కథ నడిపించాలి. కానీ ఆ బిస్కట్ పేకెట్‌ను ప్రదర్శన పూర్తయ్యేలోగా పిల్లలెవరూ విప్పి తినకుండా చూసుకోవాలి. తింటే వారికీ మీకూ కూడా ప్రమాదమే.



# నీటిలో కరిగే నాణెం

నాణమేమిటి? నీటిలో కరగడం ఏమిటి నాన్‌సెన్స్! అనుకోకండి. మ్యాజిక్‌కి సాధ్యంకానిదంటూ లేదు. ప్రస్తుతం ఈ ప్రదర్శనలో ప్రేక్షకులలో ఒకరి వద్దనుండి ఒకరూపాయి నాణెమును తీసుకొని అది వారిచేతనే ఒక మంచినీరుగల గాజుకూజాలో వేయించి ఆ తరువాత చూస్తే నాణెము కనబడదు. వారి చేతితోనే వారే నీటిలో వేస్తారు. అది కాస్తా కరిగిపోతుంది. అతని నాణెంపోయిందని విచారించినా మీరు చేసిన పనికి ఆనందం కలిగి మీకు ప్రశంసలు దక్కుతాయి.

ఇది చేయటానికి ముందుగా మీరు రూపాయి సైజులో తయారు చేయబడిన అద్దపు బిళ్ళను (బ్యాటరీ లైటులో ఉండే అద్దంకన్న కొద్దిగా చిన్నది) మీ అరచేతిలో ఉంచుకోవాలి. ప్రేక్షకులలో ఒకరిని పిలిచి వారి వద్ద ఒక రూపాయి తీసుకొని వారివద్దనే కర్చీఫ్ కూడా తీసుకుని ఆ కర్చీఫ్‌ను వాటర్‌జగ్ మీద మూతలాగపరిచి ఉంచాలి.



తదుపరి మీరు మీచేతిని జేబురుమాలు కిందనుండి దూర్చి అక్కడ ఈ రూపాయిని మెల్లిగా అరచేతిలోనికి మార్చుకొని అరచేతిలోని అద్దమును వేళ్ళతో పట్టుకొని (అవసరమైతే

రెండు చేతులూ ఉపయోగించవచ్చు) వారిని పైనుండి జేబు రుమాలుతో సహా పట్టుకోమని చెప్పాలి. వారు ఆ విధముగా చేసిన పిదప మీరు (రూపాయితోసహా) చేయితీసేయండి. ప్రస్తుతం వారు నాణెమును పట్టుకున్నామని భావిస్తారు. ఎందుకంటే జేబురుమాలుతో సహా పట్టుకున్నారు. కనుక అది నాణెమో అద్దమో తెలియదు. నాణెమనే భావిస్తారు. ఇప్పుడు వారు చెయ్యి వదిలితే అద్దము నీళ్ళ కూజాలో పడుతుంది.

ఈ విధముగా వారు పట్టుకున్న పిదప, మీరు వారిచేత కొన్ని పనికిరాని మంత్రాలు ఓం హ్రీం భీం జీం అని పలికించి వారిని ఆ నాణెమును వదిలేయమని చెప్పండి. వారు వెంటనే వదులుతారు. ఆ నాణెమనుకునే అద్దం నీళ్ళలో పడిపోతుంది. ఇప్పుడు మీరు కర్చీఫ్ పైకి తీసి వారిని జగ్‌లో చూడమనండి. అద్భుతం! నాణెము కరిగిందని అందరూ ఒప్పుకుంటారు.

అద్దపుముక్కను నీళ్ళలోవేస్తే కనపడదు. కానీ వారిని నీళ్ళలో చేయి పెట్టనివ్వకండి. తరువాత మీరు జేబురుమాలు క్రింద రూపాయిని, అద్దమును మార్చినపుడు, అద్దము వారు పట్టుకున్నప్పుడు, మీరు రూపాయితో సహా చేయి తీసినపుడు, చాలా జాగ్రత్తగా రూపాయిని వారు గమనించకుండా తీయండి.

తరువాత ఈ రూపాయిని మీ మేజిక్ సామాను తయారు చేసుకోడానికి పెట్టుబడిగా ఉంచుకోండి. మేజిక్‌కే ఖర్చు పెట్టాలి. ఇంతవరకు నాకు ఈ అయిటమ్ మీద 500 రూపాయలదాకా వచ్చాయి.

*మేజిక్ ప్రదర్శించినప్పుడు ప్రేక్షకులు ప్రశంసిస్తారు. అయితే చదువుకునే సమయంలో ఒక హాబీగా మాత్రమే ఉండాలి. పిచ్చిగా మారకూడదు. దాంతో చదువు మూలబడుతుంది.*



# ఊసరవెల్లిని గుర్తుచేసే పెన్సిలు

"ఊసరవెల్లి ప్రదేశాన్ని బట్టి రంగులు మారుస్తుందని కొంతమంది నమ్మకం. అది నిజంకాదని శాస్త్రజ్ఞులు అంటారు. కానీ రంగులు మార్చే జంతువుగా ఈనాటికీ ఊసరవెల్లినే ఉదాహరణగా చెబుతారు. మాదగ్గర వున్న వస్తువులు కూడా అప్పుడప్పుడు ఊసరవెల్లుల మాదిరిగా ప్రవర్తిస్తాయి" అంటూ ఉపోద్ఘాతం ఇచ్చి తన దగ్గర వున్న ఒకనీలంరంగు పెన్సిలును ప్రేక్షకులకు చూపిస్తాడు మెజీషియన్.

ఆ పెన్సిలులో ఎలాంటి మాయా లేదని నిరూపించడానికి దానితో ఒక తెల్ల కాగితంమీద గీతలు గీసి చూపిస్తాడు. ఆ తరువాత ఎరుపు రంగు జేబు రుమాలును ప్రేక్షకులకు చూపించి, అవసరమనుకుంటే పరీక్షకు యిచ్చి ఆ రుమాలును నీలంరంగు పెన్సిల్‌పై కప్పుతాడు. ఆ వెంటనే మేజిక్ కర్రతో రుమాలు కప్పివున్న పెన్సిలు చుట్టూ రెండు మూడుసార్లు తిప్పి, ఆ తరువాత రుమాలును బయటకు తీస్తాడు. అంతవరకూ ఆపెన్సిలు అతని ఎడమ చేతిలోనే వుంటుంది.

రుమాలు తీసిన వెంటనే అప్పటివరకు నీలంరంగులో వున్న పెన్సిలు ఎరుపురంగులోకి మారి వుంటుంది. కావాలనుకుంటే ప్రేక్షకులు దానిని పరీక్షించుకోవచ్చు. నమ్మకం కుదరకపోతే ఆ జేబు రుమాలును కూడా ప్రేక్షకులు మళ్ళీ పరీక్షించవచ్చు. ఆ రకంగా ఎన్ని రంగులనయినా మార్చవచ్చుననీ, కానీ అన్ని రంగుల



జేబురుమాళ్ళు అవసరమవుతాయని చెప్పి వేరే అంశం చేయటానికి ఉపక్రమిస్తాడు మెజీషియన్.

ఈ అంశం చేయటానికి పెన్సిళ్ళను మార్చవలసిన అవసరంలేదు. రుమాలులో ముందుగా పెన్సిలు దాచవలసిన అగత్యమూ లేదు.

ముందుగా నీలంరంగు కాగితాన్ని సంపాదించి, పెన్సిలు ఆకారంలో గొట్టంలా చేయండి. తరువాత ఎరుపురంగు పెన్సిలు తీసుకొని రాయటం కోసం చెక్కిన భాగాన్ని వదిలేసి మిగిలిన ఎరుపు భాగాన్ని నీలంరంగు కాగితం గొట్టంతో మూసేయండి. అది చూడటానికి నీలంరంగు పెన్సిలు మాదిరిగా కన్పిస్తుంది.

ఎర్రరంగు జేబురుమాలును ఆ పెన్సిలుపై కప్పినప్పుడు నీలం రంగు గొట్టంతో సహా రుమాలును బయటకు తీయండి. మీ ఎడమ చేతిలో ఎరుపురంగు పెన్సిలు మిగిలిపోతుంది. రుమాలును బయటకు తీసిన వెంటనే ఎర్రపెన్సిలును అందరూ చూసే విధంగా స్టేజిపై పడేయండి. అప్పుడు అందరి దృష్టి పెన్సిలుపై వుంటుంది.

ఈలోగా మీ చేతిలోని జేబురుమాలును మీ అసిస్టెంటుకు ఇచ్చేయండి. అతను ఆ రుమాలులోని నీలంరంగు గొట్టాన్ని తీసేసి మామూలు జేబు రుమాలును టేబుల్‌పై ఉంచుతాడు. లేదా గొట్టంతో సహా రుమాలును కూడా స్టేజిపై పడేయండి. ప్రేక్షకులు అడిగితే గొట్టాన్ని కింద పడేసి జేబు రుమాలును పరీక్షకు ఇవ్వండి. అవకాశాన్ని బట్టి పెన్సిలు, గొట్టం, రంగులు మార్చుకోవచ్చు.

ఇంకా రంగులు మార్చండని ఎవరేనా అంటే "చేయవసిన అంశాలు చాలా వున్నాయి. ఈ ఒక్క అంశంతోనే సరిపెడితే బాగుండదు కదా" అని చెప్పి తప్పించుకోండి.

> *ప్రముఖనటి జమునగారి తండ్రి శ్రీ నిప్పాణి శ్రీనివాసరావుగారు చక్కని మెజీషియన్. ఆయనవద్ద మేజిక్‌కి సంబంధించిన పుస్తకాలు అనేకం ఉండేవి. మనకున్న మెజీషియన్లలో ఆయన ముఖ్యులు.*



# నిమ్మకాయలతో నాట్యం చేయించండి

మంచి టేబుల్ క్లాత్ వేసి అందంగా అమర్చిన టేబుల్ మీద మెజీషియన్ 2 నిమ్మకాయలను ఉంచి, కమాన్ స్టార్ట్ డాన్స్! అనగానే ఆ నిమ్మకాయలు అటూ ఇటూ కదులుతూ డాన్స్ చేస్తాయి! రైట్ అన్నపుడు ఆ రెండు కాయలూ కుడిపక్కకు పరుగెడుతాయి. లెప్ట అనగానే ఎడమవైపు నడుస్తాయి. చూసిన ప్రేక్షకులు చాలా ఆనందిస్తారు. పిల్లలు ఉత్సాహతో కేరింతలు కొడతారు.

ఈ మేజిక్ చేయడానికి మీకు చాల నమ్మకమైన అసిస్టెంటు కావాలి. ఈ ప్రదర్శన విజయం పూర్తిగా అతని మీదే ఆధారపడి ఉంటుంది. అతను టేబుల్ క్రింద ఉండి ఈ కథ నడిపిస్తాడు. ఇది చెయ్యడానికి ఆడవారు వేసుకునే గాజులు రెండు కావాలి. ఆ గాజులను ట్వయిన్ దారంతో కట్టి, టేబుల్ మీద ఉంచి దారాలను బల్ల క్రిందకు దూరి ఈ రెండు దారముల చివరలను రెండు చేతులతో పట్టుకుని కూర్చొని ఉంటాడు. తరువాత ఒక పెద్ద టేబుల్ క్లాత్ తీసుకొని టేబుల్‌ను పూర్తిగా కప్పేయాలి. అంటే అసిస్టెంటు ప్రేక్షకులకు అసలు కనపడకూడదు. ఇపుడు మీరు ప్రదర్శన ప్రారంభించాలి.



"లేడీస్ అండ్ జంటిల్‌మెన్, నేను ఇపుడు మీముందు జీవంలేని నిమ్మకాలయలను డాన్సు చేయిస్తాను" అని రెండు నిమ్మకాయలు తీసి వాటిని ప్రేక్షకులను పరీక్షకు ఇచ్చి ఆ తరువాత వాటిని టేబుల్ మీద ఉంచాలి టేబుల్ మీద పెట్టేటపుడు టేబుల్‌క్లాత్ క్రింద ఉన్న గాజులు ఎక్కడ ఉన్నాయో చూసుకొని, వాటిని గుర్తుంచుకొని, వాటి మధ్యలో ఈ కాయలను ఉంచాలి. అంటే రెండు గాజులలోనూ రెండు నిమ్మకాయలున్నాయన్న మాట. ఇపుడు మీరు మీ మంత్ర కర్రతో టేబుల్ మీద కుడివైపు చివరన గట్టిగా కొట్టి కమాన్ రైట్ అనాలి! వెంటనే కిందనున్న అసిస్టెంటు కుడిచేతిలో వున్న దారం చివరను లాగుతాడు. ఆ తాడుతో పాటు కట్టిన గాజులు కూడా కుడిపక్కకు వస్తాయి. దాంతోబాటు ఆ గాజులలో ఉన్న నిమ్మకాయలు కూడా కదులుతాయి. కానీ చూసేవారికి నిమ్మకాయల కదలిక మాత్రమే కనబడుతుంది.

కానీ గాజులు కనబడవు. అదేవిధంగా లెఫ్ట్ అన్నపుడు అసిస్టెంటు ఎడమవైపు దారం లాగుతాడు. డాన్స్ అన్నప్పుడు ఒకసారి కుడి, మరోసారి ఎడమ- మళ్ళీ కుడి, ఈ విధంగా చేస్తే డాన్సు చేస్తున్నట్లుగా కనబడతాయి. చూసేవారు చాలా ఆనందిస్తారు. నిమ్మకాయలకు బదులుగా కోడిగుడ్లు కూడా వాడవచ్చు ప్రదర్శన అయిన 10 నిమిషాల తర్వాత గానీ అసిస్టెంటు బయటకు రాకూడదు. అదయినా టేబుల్ రెండవవైపు నుండి ప్రేక్షకులకు కనబడకుండా బయటకురావాలి. సాధారణంగా ఈ అసిస్టెంటుగా ఆడవారిని ఉంచితే రహస్యం దాగుతుంది.

> *మీ మేజిక్ ప్రదర్శనకి అసిస్టెంటుగా వీలైనంతవరకు మీకు నమ్మకంగా ఉండేవారినే తీసుకోవాలి. వారైతే రహస్యాలు రహస్యంగా ఉంచుతారు.*



# ఛూ... మంతర్

భారత దేశంలో మనకున్న మంచి మెజీషియన్లలో హైదరాబాదుకి చెందిన పాతకోటి నాగేశ్వరరావు ఒకరు. ప్రభుత్వం నిర్వహించిన జాతీయ సాంస్కృతిక కార్యక్రమాల్లో నాతోపాటుగా అనేక ప్రదర్శనలు చేసారు. నేను గర్వించదగ్గ నా శిష్యుల్లో ముఖ్యమైనవారు.

అతని ప్రదర్శనలో ఎక్కువగా దేశ సమైక్యతను బోధించే మేజిక్‌లు వుంటాయి. అవి అందరికీ నచ్చే, మెచ్చే పద్ధతిలో చేయటం ఆయన ప్రత్యేకత.

జాతీయ పతాకంలోని మూడు రంగులైన - కాషాయం, తెలుపు, ఆకుపచ్చ రంగులలో వున్న 3 రంగు కాగితాలను ప్రేక్షకులకు చూపాడు. అవి ఒక్కొక్కటి 10 అంగుళాలు పొడుగు, అంతే వెడల్పు వున్నాయి. తరువాత జాతీయ పతాకం ప్రాముఖ్యత గురించి వివరించి, మూడు రంగుల కాగితాలను పట్టుకుని, అందులోని ఒక్కొక్క కాగితం తీస్తూ, ముందుగా తెలుపు తీసి ప్రేక్షకులకు చూపి టేబుల్‌పైన పెట్టాడు. తరువాత ఆకుపచ్చ, చివరగా కాషాయం చూపించి ఒకదాని పైన ఒకటి పెట్టాడు. రంగులను గురించి బాగానే చెప్పాడు. కానీ, వరుస క్రమం సరిగ్గా లేకపోవటం వలన ప్రేక్షకులలో ఒకరిద్దరు ప్రశ్నించారు. అపుడు అతను ఆ కాగితాలను అలాగే ఒక గొట్టంలాగ చుట్టి "నిజమే పొరపాటై పోయింది. ముందుగా



కాషాయం, తరువాత తెలుపు, చివరగా ఆకుపచ్చ చూపాలి. అయినా ఫరవాలేదు నా దగ్గర మంత్ర దండం వుంది అని చెప్పి 'ఛూ మంతర్', 'ఛూ మంతర్' అని రెండుసార్లు అని, ఆ గొట్టం విప్పాడు.

ఆశ్చర్యం! వాటిల్లో అడుగున వుండవలసిన తెల్ల కాగితం మధ్యలోకి, మధ్యనున్న ఆకుపచ్చ కాగితం అడుగుకి పోయింది. అపుడు సరిగ్గా త్రివర్ణ పతాకంలో రంగులులాగ పైన ఎరుపు, మధ్యలో తెలుపు, క్రింద ఆకుపచ్చ రంగులు వచ్చాయి. అతనికి అభినందనలు దక్కాయి. ఇది ఎలా చేశాడు?

దీనికి మీకు కావలసిన పరికరాలు మూడు రంగుల పేపర్లు మాత్రమే.

ఇందులో నిజానికి కష్టపడవలసినది కానీ, ముందుగా చేసుకోవలసినదిగానీ ఏదీ లేదు. అప్పటికప్పుడు క్షణాల్లో చేయవచ్చు. ముందుగా తెలుపు కాగితం టేబిల్ మీద పెట్టి, తరువాత ఆకుపచ్చ కాగితం, బొమ్మలో చూపినట్లుగా తెల్ల కాగితం మీద వుంచాలి. తరువాత ఎర్ర కాగితం కూడా వుంచి, మూడింటినీ ఒక గొట్టంలాగ చుట్టి, అలాగే టేబిల్ మీద వుంచి, తిరిగి తెరిచి చూస్తే పేపర్ల వరుసక్రమం మారి వుంటుంది.

ఇది చూడటానికి ఎంతో ఆశ్చర్యంగా కనపడినా, నాలుగయిదుసార్లు చేస్తే ఇందులోని రహస్యం అర్థమయిపోతుంది. ఇది పేపర్లతోనే కాకుండా జేబు రుమాళ్ళతో కూడా చేయవచ్చు.



# అపర మహేశ్వరులు

"శివుడు మన్మథుడిని బూడిద చేశాడు. కాని మళ్ళీ రూపం ఇవ్వలేకపోయాడని పురాణాలు చెబుతున్నాయి. కాని మేజిక్కును ప్రదర్శించే వారిలో చాలామంది ఒక వ్యక్తిని మంటలలో బూడిదచేసి, మిగిలిన అస్థిపంజరాన్ని మళ్ళీ అదే మనిషిగా సృష్టిస్తూ వుంటారు. ఇపుడు నేను అలాంటి అంశాన్నే ప్రదర్శిస్తాను" అని చెప్పి మెజీషియన్ ప్రేక్షకులలో ఒకరిని తమవద్ద ఉన్న రూపాయినోటు నెంబరును రాసుకొని ఆ నోటు తనకు ఇవ్వవలసిందిగా కోరతాడు. ఆ రూపాయినోటు మీద మరో నలుగురయిదుగురిచే సంతకాలు పెట్టించి అందరికీ చూపిస్తాడు.

ఒకకవరును కూడా ప్రేక్షకులకు పరీక్షకు ఇచ్చి రూపాయినోటును మామూలుగా కాల్చకూడదు కనుక కవరులో పెడుతున్నాననిచెప్పి అలా చేస్తాడు. తరువాత అసిస్టెంటు తెచ్చిన సీసాలోని జిగురుతో కవరుకు సీలు వేసి, ఒక కొవ్వొత్తిని వెలిగించి ఆ మంటలో నోటుతో సహా కవరును అంటించి బూడిద చేసేస్తాడు.



ఇంతలో అసిస్టెంటు రెండు రొట్టెలను తీసుకువస్తాడు. రూపాయినోటు యజమానిని పిలిచి 'రెండు రొట్టెలలో ఏది మీకు కావాలి?' అని మెజీషియన్ అడుగుతాడు. ఆయన ఒక దానిని ఎంచుకున్న తరువాత ఆ రొట్టెకు చుట్టివున్న కాగితాన్ని తొలగించి లోపలవున్న ఒక్కొక్క రొట్టె

ముక్కను తీయమంటారు. రూపాయినోటు యజమాని రెండుమూడు రొ ముక్కలను తీసేసరికి అందులో ఆయన అంతక్రితం ఇచ్చిన రూపాయి నో ఉంటుంది. దాని నెంబరును ఇదివరకు తాను రాసుకొని వున్నాడు కన దానితో పోల్చి చూసుకుని ఆ నోటు తనదేనని ఆయనంటాడు.

ఈ అంశం ప్రదర్శించటానికి నమ్మకమైన అసిస్టెంటు కావాలి. అందరిముం కాల్చి బూడిదచేసిన ఆ కవరును ముందు మనం తయారుచేసుకోవాలి. మామూ కవరుకు అడ్రసు రాసేచోట రెండు అంగుళాలు బ్లేడుతో కోత పెట్టాలి. తరువా కవరును ఎడమచేతిలో ఉంచుకొని ప్రేక్షకుడు ఇచ్చిన రూపాయి నోటును రెండుసా మడిచి కవరులో పెడుతున్నట్లుగా నటిస్తూ కవరును కత్తిరించిన భాగంలోం ఎడమ అరచేతిలోనికి తీసుకురావాలి. అసిస్టెంటు జిగురుసీసా తీసుకువచ్చినప్ప ఆ సీసాను ఎడమచేత్తోనే తీసుకొని, రూపాయి నోటును అతనికి అందివ్వాలి.

తరువాత మనం కవరును జిగురుతో అంటించి కొవ్వొత్తిని వెలిగించి కవరు నిప్పుపెట్టి బూడిద చేయాలి. ఇంతలో సిద్ధం చేసుకున్న రెండు రొట్టెలలో ఒకదాని పై కాగితం ఊడదీసి మెజీషియన్ అందించిన రూపాయి నోటును అందుల పెట్టి మళ్ళీ కాగితం చుట్టేసి ఆ రెండు రొట్టెలను టేబుల్‌పైన పెడతాడు అప్పుడే ఏ రొట్టెలో రూపాయి నోటు ఉందో సంజ్ఞ చేస్తాడు. ఆ తరువాత నోటు యజమానిని పిలిచి ఏదో ఒక రొట్టెను తీసుకోమని చెప్పాలి.

ఆయన నోటు ఉన్న రొట్టెనే ఎంచుకుంటే ఏ గొడవాలేదు. అలాకాక, నోటులేని రొట్టెను తీసుకుంటే అది మీకు ఇమ్మని చెప్పి టేబుల్‌పై వున్న రెండో రొట్టెను ఆయనను తీసుకోమని, ఆ రొట్టెపై వున్న కాగితాన్ని తొలగింపజేయండి. తరువాత కథ మామూలే.



# మిఠాయి పొట్లంలో కోక్

గాలినుండి కోక్‌ను సృష్టించి మెజీషయన్లనే ఆశ్చర్యపరిచాడు తిరుపతిలోని మేజిక్ బాలాజీ. నటుడు, మెజీషియన్ అయిన బాలాజీ ఇటీవల జరిగిన సమావేశంలో తన వంతు అంశంగా ఒక దినపత్రికను అందరికీ చూపించి, దానిని మిఠాయి పొట్లంలా మడిచి ప్రేక్షకులలో ఒకరిని ఒక గ్లాసు తీసుకొని రమ్మనిచెప్పి దానిని పొట్లంకింద ఉంచమన్నారు.

తరువాత ఆయన పొట్లం క్రింద భాగాన్ని కత్తెరతో కత్తిరించారు. అంతే! ఆ పొట్లంలోంచి జలజలా కూల్‌డ్రింక్ ప్రవహించి గ్లాస్ నిండింది. ఏ పువ్వులో, చాక్‌లెట్లో అనుకుంటే పొట్లంలో ఎక్కడో దాచారనుకోవచ్చు కానీ ద్రవపదార్థమైన డ్రింకు రావటం విచిత్రమే. ప్రదర్శన అనంతరం



ఆయన ఆ పేపరును పరీక్షకిచ్చారు. ఈ అంశం చాలామంది మెజీషియన్లకే ఎంత ఆలోచించినా అంతుచిక్కని రహస్యం అయింది.

ఈ అంశంలో ఏ డ్రింకు కావాలన్నా వస్తుంది. కానీ అది మీరు ముందుగా కొనుక్కొని ఉంచుకోవాలని వేరే చెప్పనక్కర్లేదు. మీరు సృష్టించదలుచుకున్న ద్రవపదార్థాన్ని ముందుగా పిల్లలు ఆడుకునే పొడవైన బుడగలో నింపుకోవాలి. అరగ్లాసుడు పట్టే డ్రింకు చాలు. అంతకన్నా ఎక్కువ అనవసరం. పైగా ఇబ్బంది కూడా. తరువాత ఆ బుడగ మూతి దగ్గర దారంతో గట్టిగా ముడివేసి దానిని కుడిచేతి కోటు స్లీవులో వుంచుకొని ప్రదర్శన ప్రారంభించాలి.

న్యూస్‌పేపరును ప్రేక్షకులకు చూపించి దానిని మిఠాయిపొట్లంలా మడిచి, అందులో కుడిచేతినుంచి సర్దుతున్నట్లుగా నటిస్తూ, కోటులో దాచివుంచిన డ్రింకు బుడగను మెల్లిగా జారవేయాలి. తరువాత చేతిని బయటకు తీసి, కాగితం పొట్లంపైన మడిచి, కింద కత్తెరతో కత్తిరించాలి. అంటే బెలూన్ కూడా తెగుతుంది. అపుడు అందులోని డ్రింకు వచ్చి క్రిందనున్న గ్లాసులో పడుతుంది. తరువాత జాగ్రత్తగా పేపరులో మిగిలివున్న బుడగను తీసేసి పేపరును పరీక్షకియ్యాలి.

*జర్మనీ దేశానికి చెందిన బషెంగర్ అనే మెజీషియన్‌కి అసలు చేతులే లేవు. నోటితోనూ, కాళ్ళతోనూ ఎన్నో అంశాలు చేసి మంచిపేరు తెచ్చుకున్నాడు.*



# ఎదుటివారి మనసును అదుపులో పెట్టండి

సాధారణంగా మెజీషియన్లు మనసులో తలుచుకున్నది ముందుగా చెప్పడం మనం చూస్తూంటాం. ఇపుడు అమెరికాలో దీనికన్నా మరింత ముందుకు వెళ్ళి మరో గొప్ప అంశాన్ని కనిపెట్టారు. దాన్ని 'మెజీషియన్ సజెషన్' అంటారు. అంటే, మెజీషియన్ ప్రేక్షకుని మనస్సుకు సందేశం ఇచ్చి అదే తలుచుకునేలా చేయడం. ఈ విధంగా ఉండే విద్యను మీరు కూడా ప్రదర్శించడానికి వీలుగా ఆ అంశాన్ని ఇక్కడ వివరిస్తున్నాను.

నలుగురు ప్రేక్షకులను స్టేజీమీదకు పిలిచి, మెజీషియన్ నాలుగు చిన్న తెల్లకాగితం ముక్కలను వారికి పరీక్షకిస్తాడు. తరువాత వారిలో వారు ఏమేమి తలుచుకోబోతున్నారో ముందుగానే వ్రాస్తానని చెప్పి, వారిలో మొదటివారితో



"మీకు నచ్చిన ఒక తెలుగు సినీనటుడు లేదా నటిపేరు తలుచుకోండి, అది నేను ముందుగానే ఒక కాగితంలో వ్రాస్తాను" అంటాడు. వారు తలుచుకున్నామని చెప్పిన తరువాత, అంతక్రితం ప్రేక్షకులు పరీక్ష చేసిన ఒక తెల్ల కాగితం తీసుకొని అందులో ఏదో వ్రాసి కాగితాన్ని మడిచి అక్కడే టేబుల్ మీద వున్న గ్లాసులో వుంచుతాడు. ఆ తరువాత రెండవవారితో వెయ్యి లోపల ఏదో ఒక సంఖ్య తలుచుకోమనిచెప్తాడు. వారు తలచుకున్నామన్న తరువాత, మరో తెల్ల కాగితంలో వారు చూడకుండా ఆ సంఖ్యను వ్రాసి అది కూడా మడిచి గ్లాసులో వేస్తాడు. అదే విధంగా మూడవవారికి ఏదో ఒక ఊరుపేరు తలచుకోమని చెప్పి, అది కూడా ముందుగా వ్రాసి కాగితాన్ని మడిచి గ్లాసులో వేస్తాడు. చివరిగా నాలుగో వారితో వారి కిష్టమయిన కూరగాయ పేరు తలచుకోమని చెప్పి అదీ ముందుగానే వ్రాసి గ్లాసులో వేస్తాడు. తరువాత గ్లాసులోని చీటీలను ఒకసారి కలిపి ఒక్కొక్కటి బయటకు తీసిచదివితే అవన్నీ ప్రేక్షకులు తలుచుకున్నవే. మొదటివారు తలుచుకున్న నటిపేరు హేమమాలిని. రెండవవారికిష్టమయిన సంఖ్య నాలుగు వందల ఇరవై, మూడవ వారికి అభిమానమైన ఊరు కాకినాడ. నాల్గవ వారికి ఇష్టమైన కూరగాయ వంకాయ. ఇది ఖచ్చితంగ మెజీషియన్ తమ మనస్సులను ఆదేశించిన ప్రకారం తాము తలుచుకున్నామనే భ్రాంతిని కలుగజేస్తుంది.

ఈ అంశంలోని అసలు రహస్యం మెజీషియన్ అసిస్టెంట్‌లో ఉంది. ఇతను స్టేజిమీదకు వచ్చిన నలుగురిలో ఒకడై ఉంటాడు. అతనిని వంకాయను తలుచుకోమని ముందుగా మనం చెప్పాలి.

ఇకపోతే ప్రదర్శన ప్రారంభించినపుడు మీరు మనసుకు ఆదేశాలిస్తున్నట్లుగా నటిస్తూ మొదటివారిని వారికి నచ్చిన నటిపేరు తలుచుకోమని చెప్పి, అది మీరు ముందుగానే వ్రాస్తున్నట్లుగా హడావిడిచేసి, మొదటి కాగితంమీద వంకాయ అని వారు చూడకుండా వ్రాసి మడిచి గ్లాసులో వేయండి. ఇపుడు వారు ఏమి తలుచుకున్నారో చెప్పమని అడగండి. అది మీరు ముందుగానే వ్రాశారు కనుక (?) వారు సంశయించకుండా హేమామాలిని అంటారు. సరే రెండవవారిని ఏదో ఒక నెంబరు తలుచుకోమని చెప్పి, అదే మూడుగా వ్రాస్తున్నట్లుగా నటిస్తూ



రెండవ కాగితంపై హేమామాలిని అని వ్రాసి మడిచి గ్లాసులో వేస్తాడు. చివరిగా నాలుగోవారితో వారి కిష్టమయిన కూరగాయ పేరు తలచుకోమని చెప్పి అదీ ముందుగానే వ్రాసి గ్లాసులో వేస్తాడు. తరువాత గ్లాసులోని చీటీలను ఒకసారి కలిపి ఒక్కొక్కటి బయటకు తీసి చదివితే అవన్నీ ప్రేక్షకులు తలుచుకున్నవే. మొదటి వారు తలుచుకున్న నటి పేరు హేమామాలిని. రెండవ వారి కిష్టమయిన సంఖ్య నాలుగు వందల ఇరవై. మూడవ వారికి అభిమానమైన ఊరు కాకినాడ. నాల్గవ వారికి ఇష్టమైన కూరగాయ వంకాయ. ఇది ఖచ్చితంగా మెజీషియన్ తమ మనస్సులను ఆదేశించిన ప్రకారం తాము తలుచుకున్నామే భ్రాంతిని కలుగజేస్తుంది.

ఇకపోతే ప్రదర్శన ప్రారంభించినపుడు మీరు మనసుకు ఆదేశాలిస్తున్నట్లుగా నటిస్తూ మొదటివారికి నచ్చిన నటిపేరు తలుచుకోమని చెప్పి, అది మీరు ముందుగానే వ్రాస్తున్నట్లుగా హడావిడిచేసి, మొదటి కాగితంమీద వంకాయ అని వారు చూడకుండా మడిచి గ్లాసులో వేయండి. ఇపుడు వారు ఏమి తలుచుకున్నారో చెప్పమని అడగండి. అది మీరు ముందుగానే వ్రాశారు కనుక (?) వారు సంశయించకుండా హేమామాలిని అంటారు. సరే రెండవ వారిని ఏదో ఒక నెంబరు తలుచుకోమనిచెప్పి, అదే వ్రాస్తున్నట్లుగా నటిస్తూ రెండవ కాగితంపై హేమామాలిని అని వ్రాసి మడిచి గ్లాసులో వేయండి. ఇపుడు వారు తలుచుకున్న సంఖ్య చెప్పమనండి. వారు నాలుగు వందల ఇరవై అంటారు. ఇక మూడవవారితో వారికి ఇష్టమయిన ఊరు పేరు తులుచుకోమని చెప్పి, మీరు నాల్గవకాగితంలో కాకినాడ అని వ్రాసి మడిచి గ్లాసులో వేయండి. తరువాత నాలుగు చీటీలను బాగా కలిపేయండి. దాని వలన ఏది ముందు వ్రాశారో, ఏది తర్వాత వ్రాశారో తెలియదు. ఇపుడు ఆ నాల్గు చీటీలు ఒకరికి ఇచ్చి, ఆఖరి ఆయన ఏమి తలుచుకున్నాడో అడగండి. ఆయన "వంకాయ" అంటాడు. ఇపుడు వారిని ఒక్కొక్క చీటీ తెరచి చూడమనండి. అన్నీ వారు' అనుకున్నవే ఉంటాయి.

కానీ మీ మిత్రుడు, వంకాయ బదులుగా పొరపాటున ఏ టెంకాయో, మరో కాయో అన్నాడంటే మాత్రం మీ ప్రదర్శన అభాసు పాలవుతుంది.

# దేవతల ఆమ్లెట్

"మన పురాణాల్లో దేవతలు ఒకసారి చేతిని ఇలా గాలిలో తిప్పగానే పంచభక్ష్య పరమాన్నాలు ప్రత్యక్షమయ్యేవి. నేను కూడా దైవాంశ సంభూతుడనే" అని మెజీషియన్ చెప్పి అక్కడ వున్న ఒక స్టవ్ వెలిగించి దానిమీద ఒక పెనం ఉంచుతాడు. పెనం బాగా కాలేక మేజిక్ కర్రను దాని చుట్టూ మూడుసార్లు తిప్పి ఒకసారి పైకి చూసి విచిత్రంగా అరుస్తాడు. వెంటనే "స్ ... స్ ..." అని శబ్దం వచ్చి పెనంమీద విచిత్రంగా ఒక ఆమ్లెట్ ప్రత్యక్షమవుతుంది. అది బాగా వేగిన తరువాత చుట్టూ వున్న అందరికీ ప్రసాదంలా పెట్టి మిగిలినది తను తింటాడు.

ఇందులోని దేవ రహస్యం మేజిక్ కర్రలో వుంది. ఈ ప్రదర్శన చేయడానికి మేజిక్ కర్రను ప్రత్యేకంగా తయారు చేయించుకోవాలి. ఒక అడుగు పొడుగు ఉన్న పైపును తీసుకొని ఒకవైపు రేకుతో మూయించి పైన చక్కగా నల్లరంగు వేయించుకోవాలి. ఈ ప్రదర్శన ప్రారంభించే ముందు ఒక కోడిగుడ్డును బద్దలుకొట్టి దానిలోని సొనను ఈ పైపులో వేసి చివరన గట్టిగావున్న వెన్నతో మూసివేయాలి. వెన్నను ఫ్రిజ్‌లోగాని, ఐస్‌లో కాని ఉంచితే గట్టిపడుతుంది. ఇక ప్రదర్శన ప్రారంభించే ముందు పెనం మీద ఈ కర్రను మూడుసార్లు తిప్పితే కాలివున్న పెనం వేడికి కరిగి మేజిక్ కర్రలోని సొన పెనం మీద పడుతుంది. ఆ సమయంలో అది వారు చూడకుండా మీరు పైకి చూసి విచిత్రంగా అరవండి తరువాత మీ మేజిక్ కర్రను జాగ్రత్తగా దాచేయండి.



# పరకాయ ప్రవేశం

"పరకాయ ప్రవేశం గురించి మీరు వినే వుంటారు. అలాంటి విద్య మేజిక్‌లో కూడా ఉంది. లేడీస్ అండ్ జంటిల్మన్! మీరు దూరంగా ఎక్కడో కూర్చొని కాగితంమీద ఏదైనా రాస్తే నేను మీ మనసులో దూరి మీరేం రాశారో చెప్తాను" అంటూ మెజీషియన్ ఓ చిన్న సైజు ఉపన్యాసం దంచి, ఒక రూపాయి నోటు సైజులో వుండే కాగితాన్ని అసిస్టెంటు ద్వారా ప్రేక్షకులలో ఎవరో ఒకరికి ఇస్తాడు. ఆ వ్యక్తి మెజీషియన్‌కు సంబంధించిన మనిషికాదు. మెజీషియన్ ఆయనతో "మీకు నచ్చిన పువ్వు పేరో, కాయ పేరో, చెట్టుపేరో, సినిమా యాక్టర్ పేరో, ప్రియురాలి పేరో, ఏదో ఒకటి నేను పంపిన పెన్నుతోనే వ్రాసి ఆ కాగితాన్ని మడిచి జేబులో పెట్టుకోండి. తరువాత నేను ఆ పెన్నును తీసుకొని వ్రాయడానికి



పెన్నును, వత్తు పెట్టుకోవడానికి ఒక అట్టనూ వారికి పంపుతాను. వారు ఏదో ఒకటి వ్రాసిన తర్వాత, ఆ కాగితాన్ని మడిచి వారి జేబులో పెట్టుకుంటారు. అసిస్టెంట్ పెన్నునూ, అట్టనూ తీసుకొని మెజీషియన్‌కి ఇస్తాడు. మెజీషియన్ ఈ పెన్నుని నుదుటిమీద ఒకసారి పెట్టుకొని తరువాత సరిగ్గా ఏడు నిముషాల్లో వారు ఏమి వ్రాశారో చెప్తాడు. (ఈ ఏడు నిముషాల్లోనూ వేరే ఏదైనా చిన్న అంశాన్ని ప్రదర్శిస్తే బాగుంటుంది.) పేపరు వారివద్దనే వుంది, వ్రాస్తున్నపుడు అసిస్టెంటుకూడా దూరంగా ఉన్నాడు. అయినా వారు రాసిన విషయాన్ని తెలుసుకోవడం 'పరకాయ ప్రవేశం' ద్వారా సాధ్యం అని చెప్పి మెజీషియన్ మరో అంశం మొదలుపెడ్తాడు.

నిజానికి ఈ 'పరకాయ ప్రవేశం' అంశం మెజీషియన్ అసిస్టెంటు చురుకుదనం మీద కొంత ఆధారపడి వుంది. ఇంతకూ అసలు వ్యవహారం అంతా వత్తుకు ఇచ్చిన అట్టలో వుంది. దీనిని మనం ముందుగా తయారు చేసుకోవాలి. ఒక పావు రావు అట్టను తీసుకొని దానిమీద అంతే సైజు తెల్లకాగితం వుంచి, దాని మీద మళ్ళా అంతే సైజు కార్బను పేపరు ఉంచాలి. ఇపుడు మరో పెద్ద సైజు తెల్లకాగితాన్ని తీసుకొని దానిమీద వుంచి, అట్టసైజు కంటే ఎక్కువ వున్న భాగాన్ని జిగురుతో అట్ట వెనుక అంటించాలి. ఇపుడు అట్ట ప్రదర్శనకు సిద్ధం అయిందన్నమాట.

తరువాత అట్టనూ, చిన్న పేపరునూ, పెన్నునూ, ప్రేక్షకులకు పంపండి. మన పెన్ను పంపటంలోని ముఖ్యోద్దేశ్యం, అది బాల్‌పాయింట్ పెన్ను అవటమే. వారు అట్టను తీసుకొని దాని మీద పేపరును ఉంచి, వారు తలచుకున్నది వ్రాస్తారు. అలా వ్రాయటం వల్ల అట్టలోని కార్బన్ క్రింద వున్న పేపరుమీద కూడా అది పడుతుంది. ఇకపోతే మీరు పరకాయ ప్రవేశం చేసినట్టు జాగ్రత్తగా నటించాలి. తరువాత మీ అసిస్టెంట్ పెన్నును మీకు ఇచ్చి, ఆ అట్టను తీసుకొని లోపలికి పోయి, జాగ్రత్తగా అట్టపై నున్న కాగితాన్ని చింపి, కార్బన్ క్రిందనున్న కాగితం మీద పేరును చదువుతాడు. ఇక్కడ మీరు చాలా తెలివిగా ప్రవర్తించాలి.



మనం మంచినీళ్ళు త్రాగటానికి వెళ్ళినట్లు స్టేజి వెనుకకు వెళ్ళాలి. మీ అసిస్టెంటు మీకు నీళ్ళు అందిస్తూ ఆ కాగితంమీద ఏముందో మెల్లిగా చెప్తాడు. అంతే!

ప్రేక్షకులు వ్రాసినపుడు ముఖ్యంగా అట్ట సక్రమంగా వుందో లేదో చూసుకోవాలి. వారు అట్టను తిరగేసి దాని మీద కాగితం పెట్టి వ్రాస్తే అంతవరకూ మీరు ఎంత ఆసక్తికరమైన అంశాలు ప్రదర్శించి ఎంత పేరు తెచ్చుకున్నా, మీ పరువు గంగపాలయిపోతుంది. జాగ్రత్త. అలాగే మీ అసిస్టెంటు మీకు విషయం చెప్పేటప్పుడు ఆ మాటలు మైకుకు అందకుండా జాగ్రత్త పడాలి.

*భారతదేశంలో మొట్టమొదటి మేజిక్ పాఠశాల పేరు "బాలానందం మేజిక్ స్కూలు" 1980లో హైదరాబాదులో స్థాపించబడిన ఈ స్కూలు పేరు లిమ్కా బుక్ ఆఫ్ రికార్డ్సు (Limca Book of Records)లో కూడా నమోదు చేయబడింది. రేడియో అన్నయ్యగా ప్రసిద్ధి పొందిన న్యాయపతి రాఘవరావుగారు నాచేత పిల్లలకు మేజిక్ నేర్పించాలని స్థాపించిన స్కూలు ఇది. దీని తరువాత మనదేశంలో చాలా రాష్ట్రాల్లో మేజిక్ స్కూళ్లు వెలిసాయి. ఈ స్కూల్లో చదివిన వారిలో ఈనాటి ప్రముఖ మెజీషియన్లు, మర్రి రమేష్, సామాల వేణు, పాతకోటి నాగేశ్వరరావు, ప్రదీప్ రంగ్రేజ్, నటుడు ఉత్తేజ్ లాంటివారు 530 మంది ఉన్నారు.*

# కాగితం మీద నిలబడే గ్లాసు

రెండు గాజు గ్లాసులు తీసుకొని ఒకదానిపక్కగా మరొకటి టేబుల్ మీద ఉంచండి. వాటిమధ్యలో మరో గ్లాసు నిలబెట్టగలిగినంత దూరంలో అవి ఉండాలి. తరువాత మీ స్నేహితులను పిలిచి "ఈ రెండు గ్లాసుల మీద 10 రూపాయల నోటును ఉంచి, ఆ నోటుపై మరోగ్లాసును నిలబెట్టగలరా? " అని వారిని సవాలు చేయండి. గ్లాసు బరువుకు కాగితం ఆగదని వారు చెప్తారు.



"అయితే నేను నిలబెడుతున్నాను, చూడండి" అని పది రూపాయల నోటును యాస్‌బెస్టాస్ రేకులా మడతలు పెట్టండి. మడిచిననోటును గ్లాసులమీద అడ్డంగా ఉంచి దానిమీద గ్లాసు నిలబెట్టండి. అది నిక్షేపంగా నిలబడుతుంది. నోటుకు మడతలు ఉండటం వలన, అది గ్లాసును మోయ గలుగుతుంది.



# ఆడవారు అపనిందలు

మెజీషియన్ టేబుల్ దగ్గర కుర్చీమీద కూర్చొని ఉంటాడు. టేబుల్‌మీద పోస్టుకార్డు సైజులో నున్న పదిమంది దేశనాయకుల, లేక సినీ నటుల ఫోటోలూ, వాటికి సరిపడే పది కవర్లూ వుంటాయి. ఫోటోలు ప్రముఖమైన వారివే ఉంటాయి. ఇవి ప్రేక్షకులలో ఒకరికి పరీక్ష చేయమని ఇచ్చి ఒక్కొక్క ఫోటోలో ఉన్న వ్యక్తి పేరు చదవమని అంటాడు. వారు ఆ విధంగా చదువుతున్నప్పుడు మెజీషియన్ పది చిన్న తెల్ల కాగితాలు తీసుకొని, వాటిమీద ఆయా పేర్లు వ్రాసి మడిచి పక్కనే తిరగేసి ఉంచిన ఒక టోపీలో ఉంచుతాడు. ఈ విధంగా పదీ పూర్తయిన తరువాత, ఆ కార్డులను కవర్లలో పెట్టివాటిని మరో పెద్ద కవరులో ఉంచి కళ్ళు మూసుకొని, ఏదో మంత్రించినట్లుగా నటించి తిరిగి ఆ కవరును టేబుల్ మీద ఉంచుతాడు.

ఇపుడు ప్రేక్షకులతో "సోదర సోదరీ మణులారా! ఇపుడు నా వద్ద ఒక కవరున్నది. అందులో పదిమంది ప్రముఖ వ్యక్తుల ఫోటోలు ఉన్నాయి. ఈ ప్రక్కనున్న టోపీలోని పది చీటీలలో ఆయా నాయకుల పేర్లు వ్రాసి ఉన్నాయి. ఇపుడు మీలో ఇద్దరు ఆడవారు దయచేసి స్టేజీమీదకు వచ్చి, ఒకరు ఈ కవరులోని ఒక ఫోటో, మరొకరు ఈ టోపీలోని ఒక చీటీని తియ్యవలసినదిగా కోరుతున్నాను. ఇద్దరూ ఆడవారినే పిలవటంలో కొంత ప్రత్యేకత ఉంది. ఎందుచేతనంటే సాధారణంగా ఇద్దరు మగవారి అభిప్రాయాలు కలిసినట్టుగా ఆడవారివి కలవవు. దాని గురించి పరిశోధన చేసే ఉద్దేశ్యంతో ఈ ప్రదర్శన చేయదలచాను" అంటాడు. అదే ప్రకారంగా ఇద్దరు ఆడవారు వచ్చి ఒకరు పెద్ద కవరులోని ఒక నాయకుడు ఉన్న కవరును తీస్తారు. మరొక స్త్రీ టోపీలో ఉంచిన ఒక చీటీని తీసి చదువుతారు. ఇద్దరూ ఆశ్చర్యపోతారు. విచిత్రమేమంటే మొదటి స్త్రీ ఎన్నిక చేసి తీసిన ఫోటోలోని

వ్యక్తి పేరే రెండవ స్త్రీ తీసిన చీటీలో వుంటుంది. తిరిగి మెజీషియన్ "చూశారా అసలు నిజం ఇపుడు తెలిసింది. అసలు ఆడవారి అభిప్రాయాలు కలిసినట్లుగా మగవారివి కలవవు. ఎవరో కిట్టని వాళ్ళు ఆడవారిని ఈ విధంగా చిత్రించారు" అంటూ అందరి మెప్పునూ, ముఖ్యంగా ఆడవారి ప్రశంసలనూ సంపాదిస్తాడు.



ఈ అయిటమ్‌లో చిన్న కిటుకు ఉంది. మీరు ప్రదర్శించే పదిమంది వివిధ నాయకుల చిత్రాలతోపాటు, ఆ పదిమందిలో ఉండే ఒకే నాయకుని చిత్రాలు పది కాపీలు రహస్యంగా సిద్ధంగా ఉంచుకోవాలి. ఇపుడు ప్రదర్శన ప్రారంభించండి. ఒకరిని స్టేజిమీదకు ఆహ్వానించి వారిని ఒక్కొక్క ఫోటోలో వున్న నాయకుని పేరు చదవమని చెప్పాలి. వారు ఆ విధంగా చెప్పినపుడు మీరు వ్రాసిన చీటీలు టోపీలో ఉంచి, వారి వద్దనుండే ఫోటోలున్న కవరును తీసుకొని ఏదో మంత్రిస్తున్నట్లు కళ్ళవద్ద పెట్టుకుని పొరపాటున జారిపోయినట్లుగా కవరును వదిలేయండి. అది క్రిందపడగానే 'సారీ, అని ఆ కవరును తీసి టేబుల్‌మీద పెట్టండి. కానీ, ఇక్కడే అసలు రహస్యం ఉంది. మీరు పైకి తీసిన కవరు అసలు కవరు కాదు. మీరు ముందుగా సిద్ధం చేసి ఉంచిన కవరు. అందులో అన్నీ ఒకరి ఫోటోలే ఉంటాయి. ఇకపోతే రెండవ స్త్రీ సెలక్టు చేసిన చీటీలో అదే పేరు ఎలా వచ్చింది అనే అనుమానం రావచ్చు స్టేజిమీదకు వచ్చిన ప్రేక్షకురాలు ఒక్కొక్క పేరు చెప్పినపుడు వారు చెప్పే పేర్లు వ్రాస్తున్నట్లుగా నటిస్తూ ఒకే పేరును పదిసార్లు వ్రాస్తాడు. ఇంక రహస్యం మీకు అర్థమయి ఉండాలి. మీరు క్రింద కవర్లు మార్చేటపుడు ఎవరూ చూడకుండా ఉండడం కోసం మీ టేబుల్ చుట్టూ క్లాత్‌తో మూసి వేయడం అన్నివిధాలా మంచిపని.



# శబ్ధ భేది విద్య

ఏకలవ్యునికీ, అర్జునునికీ శబ్దభేదివిద్య తెలిసినట్లు మహాభారతంలో చెప్పబడింది. అంటే కళ్ళకు గంతలు కట్టుకొని శబ్దాన్ని విని, అది ఎటువైపు నుండి వస్తున్నదో అటు గురి తప్పకుండా బాణాన్ని వదలటం అన్న మాట. అలాగే ఇంద్రజాల విద్యలో కూడా కళ్ళకు గంతలు కట్టుకొని ఒక పుస్తకంలోని వాక్యాలను చేతులతో తడిమి చదవటం ఎంతో ఆశ్చర్యం గానూ, ఆసక్తికరంగానూ ఉంటుంది.

మెజీషియన్ టేబుల్ కెదురుగా కూర్చొని ఉంటాడు. టేబుల్‌మీద ఒక పెద్ద డిక్షనరీ లేదా మరేదయినా ఎక్కువ పేజీలుండే పుస్తకం, ఒక ఆరు అంగుళముల పొడుగు ఉండే చీపురు పుల్ల ఉంటాయి. ఇపుడు ప్రేక్షకులతో "డియర్ ఫ్రెండ్స్! మీలో ఒకరు ఈ పుస్తకాన్నీ, పుల్లనూ తీసుకొని పుల్లను ఈ పుస్తకంలోనికి ఒక ప్రక్కనుండి దూర్చండి. ఐదు అంగుళాల భాగం పుస్తకంలోనూ ఒక అంగుళం బయటకూ ఉండాలి. నేను కళ్ళకు గంతలు కట్టుకొని మీరు పుల్లను ఏపేజీలో ఉంచారో ఆ పేజీ తీసి అందులోనున్న మొదటి, చివరి వాక్యములను చేతులతో తడిమి వెంటనే చెప్తాను" అని అంటాడు.

ప్రేక్షకులలో ఒకరు అలాగే చేస్తారు. అప్పుడు మజీషియన్ తన వద్దనున్న జేబు రుమాలును కళ్ళకు కట్టుకొని, ఆ పుస్తకాన్ని రెండు చేతులతో టేబుల్ క్రిందకు తీసుకొని వారు పుల్ల ఉంచిన పేజీనే తీసి అక్షరములను తడిమి, తిరిగి పుల్లను యథాస్థానంలో ఉంచి, పుస్తకమును ప్రేక్షకులలో ఒకిరిక ఇచ్చి, ఆ పేజీ నంబరూ, పేజీలోని మొదటి వాక్యమూ, చివరి వాక్యమూ అన్నీ గడ గడా చెప్తాడు.



అతీతశక్తి అనిపించే ఈ ప్రయోగం చేసే ముందుగా, మీరు ఆ పుస్తకం మధ్యలోని ఒక పేజీ తీసి, దాని నంబరూ, మొదటి చివరి వాక్యములనూ బాగా గుర్తుపెట్టుకొని, అందులో ఆరు అంగుళాల పొడవు ఉండే చీపురు పుల్లను మధ్యలో ఉంచి, పుస్తకమును మామూలుగా టేబుల్ మీద ఉంచండి. మీరు పుల్లను మధ్యలో ఉంచినది అంతగా కనబడదు. ఆ పుస్తకము ప్రక్కనే మీరు మరొక పుల్లను పెట్టి ప్రదర్శన ప్రారంభించండి. ప్రేక్షకులలో ఒకరిని పిలిచి ఆ పుల్లను పుస్తకములో ఒక ప్రక్కనుండి దూర్చమని చెప్పండి. ఆ తరువాత మీరు కళ్ళకు రుమాలు కట్టుకొని ఆ పుస్తకమును టేబుల్ క్రిందకు తీసుకొని, వారు పెట్టిన పుల్లను వారు చూడకుండా జాగ్రత్తగా తీసి క్రింద పడవేసి తిరిగి పుస్తకాన్ని మామూలుగా వారి ఆ పేజీ నంబరు, మొదటి చివరి వాక్యములను చెప్పేయండి. కానీ ఆ గుర్తు పెట్టుకున్న పేజీలోనివి. వారు పుల్ల ఉన్న పేజీని తీసి చూస్తే అన్నీ కరక్టుగా ఉంటాయి. ఆ పుల్ల, వారు ఉంచినదే అని భ్రమపడతారు. లేకపోతే ఎవరయినా మేము ఉంచిన పుల్ల మధ్యలో ఉంచడం వలన ప్రేక్షకులకు అనుమానం కలుగుతుందనిపిస్తే నెమలి కన్నునో, రూపాయి నోటునో, లేదా చిన్న బుక్ మార్కుతోనో ఈ మేజిక్ చేయవచ్చు

*మీ ప్రదర్శనలో వ్యక్తులను కానీ, ఇతర మెజీషయన్లను కానీ విమర్శించకూడదు. దానివలన మీరు ప్రేక్షకులకు చులకన అవుతారు. మతతత్వాలు, కులతత్వాలు, రెచ్చగొట్టే అంశాలు చేయకూడదు.*



# మీరూ సృష్టి కర్తలే

భారతదేశంలోనే కాక ఇతరదేశాల్లో కూడా ఖ్యాతి పొందిన మన మెజీషియన్లలో ప్రొఫెసర్ పి.సి.సర్కార్ (సీనియర్) తరువాత ప్రొఫెసర్ ఓ.పి. అగర్వాల్ మాత్రమే అంతటి ఖ్యాతి గడించారు. జపాన్ మేజిక్ సర్కిల్‌వారు "మేజికానా ఆఫ్ ఇండియా" అనే బిరుదు నిచ్చి ఘనంగా సత్కరించారు. అతని మేజిక్ ప్రదర్శనలోముఖ్యంగా ఎక్కువ మందిని ఆకర్షించేది ఒక స్త్రీని కాల్చి అస్థిపంజరంగా చేసి మళ్ళీ ఆ స్త్రీని సృష్టించడం. ముందుగా ఒక స్త్రీని అందరికీ పరిచయం చేసి ఆమెను ఒక పెట్టెలో పడుకోపెట్టి ఆమెమీద పెట్రోలు పోసి నిప్పంటించేవాడు. ఆమెను పూర్తిగా కాల్చి అస్థిపంజరంగా చేసి ప్రేక్షకులకు చూపుతూ, దానిమీదే ఒక దుప్పటిని మూసి తీసేసరికి ఆ అమ్మాయి ప్రత్యక్షమయ్యేది. ఈ ప్రదర్శన చూస్తుంటే ఒళ్ళు జలదరిస్తుంది. ఈ బాపతు అంశాన్ని మీరు కూడా సులువుగా చేయవచ్చు

స్త్రీలు ఉపయోగించే చిన్నజేబురుమాలును తీసుకొని ప్రేక్షకులకు చూపిస్తాడు మెజీషియన్. తరువాత అందరి ఎదురుగా ఒక అగ్గిపుల్లను వెలిగించి ఆ రుమాలుకు నిప్పు అంటిస్తాడు. ఆ చిన్న జేబు రుమాలు పూర్తిగా కాలిపోతుంది. ఆ తరువాత ఆ బూడిదను తీసుకొని చేతులకు రుద్దుకొని, ఏవో మంత్రాలు చదివి ఇందాక పూర్తిగా భస్మమైపోయిన జేబు రుమాలును మళ్ళీ సృష్టిస్తాడు.

ఈ అంశం చేయడానికి కొంచెం హస్తలాఘవం కావాలి. ఇందులోని అసలు మాయ అంతా ఏమాత్రం ప్రాముఖ్యంలేని వస్తువులా కనబడే అగ్గి పెట్టెలో ఉంది. ఈ అంశం చేయడానికి ముందు మీరే ఒకే విధంగా ఉండే చిన్న చిన్న జేబురుమాళ్ళను రెండింటిని సంపాదించాలి. తర్వాత అగ్గిపెట్టెను తీసుకొని, దానిని సగంవరకు తెరిచి ఉంచాలి. అలా తెరవటంవల్ల అగ్గిపెట్టెలో



గుల్లలో కొంతభాగం ఖాళీ ఏర్పడుతుంది. ఇపుడు మీరొక జేబురుమాలును తీసుకొని బాగా మడిచి ఆ ఖాళీభాగంలో దాచి ఆ సగం తెరిచిన అగ్గి పెట్టెను రుమాలుతో సహా టేబుల్ మీద ఉంచాలి.

ప్రదర్శన ప్రారంభించే ముందు ఒక చేతి రుమాలును పరీక్షకిచ్చి టేబుల్ మీద గల మనం తయారు చేసుకున్న అగ్గిపెట్టెను తీసుకొని, అందులోని ఒక అగ్గిపుల్లను వెలిగించి రుమాలును అంటించేయాలి. మీరు పెట్టను టేబుల్ మీద ఉంచేటప్పుడు పుల్లలు గల భాగాన్ని లోపలికి తోయాలి. దానివల్ల మీరు గుల్లలో దాచిన రెండో రుమాలు మీ చేతిలోకి వస్తుంది. జాగ్రత్తగా కనబడకుండా అరచేతిలో దానిని దాచి ఉంచుకోవాలి. ఇపుడు కాలిన రుమాలు బూడిదను తీసుకొని కాసేపు నాటకం ఆడి, ఈ రుమాలును సృష్టించినట్లుగా ప్రదర్శించండి.

*ప్రముఖ సినీ హాస్యనటులు శ్రీ రమణా రెడ్డి చాలా గొప్ప మెజీషియన్. ఒక సినిమాలో మేజిక్ చేయాల్సివచ్చినప్పుడు ఆయన మిశ్రీ అనే మెజీషియన్ దగ్గర నేర్చుకున్నారు.*



# చికిత్స చేసే అగ్గిపెట్టె

"ఒకసారి ఏం జరిగిందంటే..." అంటూ మెజీషియన్ ప్రదర్శన ప్రారంభిస్తూ "నేనొకసారి నలుగురు మిత్రులతో కలసి హోటల్‌కి వెళ్ళాను. హోటల్‌లోకి మేము ప్రవేశించడం, లోపల సర్వర్ చేతిలోని గ్లాసులు కిందపడి బద్దలవటం, మా స్నేహితుడు ఆ గాజు ముక్కల మీద కాలు వేయడంతో గాయాలవటం - అన్నీ క్షణకాలంలో జరిగిపోయాయి. మా వాడికి రక్తం వస్తోంది. సమయానికి ఫస్ట్ ఎయిడ్ బాక్సు లాంటి వేవీ దరిదాపుల్లో లేవు. సరేనని మా వాడి కాలును ముందు బాగా కడిగించి, తరువాత ఓ అగ్గిపెట్టెను తీసుకొని అది తెరచి, అందులో నిండుగా ఉన్న పుల్లలు వారికి చూపించి, అందులోంచి ఓ పుల్లను బయటకు తీశాను. వాడు నేనేదో నాటు వైద్యం చేయబోతున్నానేమోనని 'వద్దురా దణ్ణం పెడతాను. నన్ను వదిలేయ్' అన్నాడు. ఫరవాలేదని చెప్పి, ఆ అగ్గిపుల్లను నుదుటిమీద ఉంచుకొని, చిన్న మంత్రం చదివి, పెట్టెమీద ఆ పుల్లను మూడుసార్లు తిప్పి, పెట్టెను మళ్ళీ తెరిచాను. అందులో దూది ఉంది. వెంటనే వాడు అది తీసుకొని, గాయం మీద ఉంచుకున్నాడు. తరువాత పెట్టెను మూసి మళ్ళీ అగ్గిపుల్లతో మూడుసార్లు పెట్టెమీద తిప్పి, పెట్టెను తెరిచేసరికి అందులో గాజుగుడ్డ (బేండేజి క్లాత్) ఉంది. అక్కడున్న వాళ్ళకు ఈ మాయ అసలు అర్థం కాలేదు.



తరువాత అగ్గిపుల్లను పెట్టె మీద మూడుసార్లు వెనక్కి తిప్పి పెట్టెను తెరిచాను. అందులో నిండా పుల్లలున్నాయి. అపుడు నేను అది మాచ్ బాక్సు కాదు మేజిక్ బాక్సు - మీరుమనస్ఫూర్తిగా ఏది కావాలని కోరుకున్నా ఇది ఇస్తుంది అని చెప్పి, కాఫీ తాగి బయటకు వచ్చాం" అంటూ ప్రదర్శన ముగిస్తాడు. ఇందులో ప్రదర్శించినది ఒకటే అగ్గిపెట్టె .అసిస్టెంటు సహాయం అవసరం లేదు. ఎవరైనా సరే చాలా సులువుగా చేయవచ్చు

ఈ అగ్గిపెట్టెను మీరు ముందుగా తయారు చేసుకోవాలి. ఒకే బొమ్మగల రెండు అగ్గిపెట్టెలను తీసుకొని అందులోని ఒక పెట్టెమీద ఉన్న లేబుల్ ఊడదీసి, దానిని రెండవ పెట్టె వెనుకభాగంలో అతికించాలి. అంటే ఆ పెట్టెకు రెండువైపులా బొమ్మలు ఉంటాయన్నమాట. ఈ పెట్టెను ఎటువైపుండి చూసినా అది పెట్టె పై భాగంలా కనబడుతుంది.

ఇపుడు పెట్టెలోని గుల్లను బయటకుతీసి సరిగ్గా దానిమధ్యలో ఒక చిన్న అట్టముక్కను వుంచి రెండు భాగాలుగా చేసి ఒకదానిలో దూదిని, మరొక భాగంలో కొంచెం గాజు గుడ్డ ముక్కను ఉంచి గుల్లను పెట్టెలోపల ఉంచేయాలి. తరువాత పెట్టెను వెనుకకు తిప్పి గుల్లను బయటకు సగంవరకు తీసి, అగ్గిపెట్టె గుల్ల వెనుకభాగానికి, పెట్టెకు మధ్యలో ఒక్క వరుసలో మాత్రమే పుల్లలను పేర్చాలి. అంటే చూసే వారికి పెట్టెనిండా పుల్లలున్నట్లు కనబడుతుంది.

అలా అగ్గిపుల్లలను పేర్చి పెట్టెను మూసేయండి. ఇపుడు ప్రదర్శన ప్రారంభిస్తూ ముందుగా పుల్లలున్న భాగం వైపు తెరచి, అందులోని ఒక పుల్లను తీసి పెట్టెనుమూసి ఎడమ చేతిలో ఉంచుకోవాలి. ఇక్కడ జాగ్రత్తగా పెట్టెను తిరగేయాలి. తరువాత మళ్ళీ పెట్టెను తెరచి దూదిని తీయాలి. తరువాత గాజుగుడ్డను సృష్టించాలి. పెట్టెను మాత్రం పరీక్ష కివ్వద్దు.



# ప్రేక్షకులు చేసే మేజిక్

"పేకలో ప్రేక్షకులు చూసుకున్న ముక్కను మెజీషియన్ చెప్పటం మామూలే. ప్రేక్షకులే మేజిక్ చేసే అంశాలు సైతం ఇంద్రజాలంలో ఉన్నాయి. అలాంటి ఒక అంశాన్ని మీరందరూ చేయడానిక్కడ ప్రదరిస్తున్నాను" అని చెప్పి మెజీషియన్ ప్రేక్షకుల నుంచి ఒక పేక కట్టను తీసుకొని అది వారు కలిపి పరీక్ష చేసి ఇచ్చిన తరువాత, వారిలోంచి ఒకరిని స్టేజిమీదకు రమ్మని ఆహ్వానిస్తాడు.

వచ్చిన వారిని కుర్చీలో కూర్చుండబెట్టి, పేకలోంచి సరిగ్గా సగం ముక్కలు వారికిచ్చి అందులో ఒక కార్డును తీసి చూసుకొని దానిని మిగతా ముక్కలపైన ఉంచమని చెబుతాడు. ఆ తరువాత మెజీషియన్ తనవద్ద మిగిలివున్న మిగతా సగం ముక్కలను వారి ముక్కలపై ఉంచుతాడు. అనంతరం పెద్ద తువ్వాలును తీసుకొని ఆ ప్రేక్షకుని కళ్ళకు గంతలు కడతాడు. తరువాత వారి చేతిలో ఉన్న ముక్కలలోని పై ముక్కను తీసి పేక అడుగున ఉంచమని చెబుతాడు. తరువాత ఉన్న రెండవముక్కను తిరగేసి పేకమధ్యలో ఉంచమని చెబుతాడు. ఆ తరువాత మెజీషియన్ వారి కళ్ళకున్న గంతలను విప్పి, వారి చేతిలో ఉన్న పేకలో తిరగేసిన ముక్క ఎక్కడుందో చూడమని చెబుతాడు. ఆ తిరగేసిన ముక్క పేక మధ్యలో ఉంటుంది. అపుడు మెజీషియన్ సరిగ్గా దానిపక్కనున్న ముక్కను చూడమంటాడు. అది సరిగ్గా వారు అంతకుముందు చూసుకున్న ముక్కే! అంటే సరిగ్గా వారు చూసుకున్న ముక్కపక్కనే వారు తిరగేసిన ముక్కను ఉంచారన్నమాట.

ఇక్కడ ప్రదర్శించిన పేక మెజీషియన్‌ది కాదు. అవసరమైతే ప్రేక్షకులే ఇవ్వచ్చు పైగా ఈ అంశంలో మెజీషియన్ పేకను ఎక్కడా ముట్టుకోలేదు,

పైగా స్టేజిమీదకు వచ్చిన వ్యక్తి మెజీషియన్ అసిస్టెంటు కాదు. మరి ఇది ఎలా సాధ్యమయింది?



ముందుగా ప్రేక్షకునికి సగం ముక్కలు ఇచ్చి, వారిని ఏదో ఒక ముక్క చూసుకోమని చెప్పినపుడు వారు గమనించకుండా మనవద్దగల మిగిలిన సగం ముక్కలలోని అడుగు ముక్కను తిరగేసి పై ముక్కను మామూలుగా ఉంచాలి. అంటే చూసేవారు. ఆ ముక్కలన్నీ కిందకు మూసే ఉన్నాయని అనుకుంటారు. ఈలోగా వారు ముక్క చూసుకొని, అది వారివద్ద ఉన్న ముక్కలపైన ఉంచి సిద్ధంగా ఉంటారు. అపుడు మీరు మీ వద్దనున్న ముక్కలను అలాగే జాగ్రత్తగా వారి పేకపై ఉంచండి. ఇక్కడికి మీ పని సగం అయిందన్నమాట. అంటే ఇప్పటికి వారి ముక్కపైన మీ పేకలోని అడుగునున్న తిరగేసిన ముక్క ఉందన్నమాట.

ఇపుడు వాళ్ళ కళ్ళకు గంతలు కట్టి వారి చేతిలోని పేకలో పై ముక్కను కింద ఉంచమనండి. తరువాత రెండవకార్డును తిరగేసి పేక మధ్యలో ఉంచమనండి. తరువాత రెండవకార్డును తిరగేసి పేక మధ్యలో ఉంచమనండి. అది ముందే తిరగేసి ఉంది. ఇపుడు మీరు తిప్ప మనడం వలన మామూలుగా అయిపోతుంది. దానిని వారు పేక మధ్యలో ఉంచుతారు. వాళ్ళ కళ్ళకు గంతలు కట్టడంవలన వారు ఈ తిప్పి ఉన్న ముక్కను గమనించలేదు. ఇపుడు కట్లువిప్పి వారిని తిరగేసిన ముక్క ఎక్కడ ఉందో చూడమని చెప్పండి. అది మధ్యలో ఉంటుంది. అది వారు ఉంచినదేనని అనుకుంటారు. దాని పక్కనే వారు చూసుకున్న ముక్క ఉంటుంది. ఇది ఎన్నిసార్లు చేసినా విజయం మీదే. పోతే మరో విషయం- కళ్ళకు గంతలు కట్టడం అనవసరమనిపిస్తే వారిచేత పేకను వెనుకకు పెట్టించి ఈ తతంగం జరిపించవచ్చు.



# అమెరికన్ ట్రిక్

మేజిక్‌ను వృత్తిగా స్వీకరించి అమెరికాలో దిగ్విజయంగా ప్రదర్శనలు ఇస్తున్నవారిలో ప్రొఫెసర్ మెల్‌బోర్న్ క్రిస్టఫర్‌ను ప్రత్యేకంగా చెప్పుకోవాలి. తన ఇంటికి ఎవరైనా అతిథులు వస్తే వారిముందు అతను ప్రదర్శించే అంశం చాలా గమ్మత్తుగా ఉంటుంది.

ముందుగా అతను ఓ పేక సెట్టును అతిథుల పరీక్షకు ఇచ్చి వారిలో ఒకరిని పేక సెట్టులోంచి ఒక ముక్కను ఎంచుకోవలసినదిగా కోరతాడు. తరువాత అతిథి ఎంచుకున్న పేకముక్కతో సహా ఆ పేక సెట్టును బాగా కలిపి, టేబుల్‌పై ఆ ముక్కలను బోర్లేసి విడివిడిగా పరుస్తాడు. అలా చేయటంవల్ల అతిథి ఎన్నుకున్న పేకముక్క వాటిలో ఎక్కడ ఉందో మెజీషియన్‌కు తెలియదు. అలాగే ఆ అతిథికి కూడా ఆ విషయం అంతుపట్టదు. తరువాత ఒక దినపత్రికను ఆ పేకముక్కలపై కప్పి తన కళ్ళకు గంతలు కట్టించుకుని అందరూ చూస్తుండగా తన చేతిలో ఉన్న చాకుతో దినపత్రికపై దృఢంగా గుచ్చి ఆ పత్రికను చింపేస్తాడు. చింపిన చాకు మొనకు ఒక పేకముక్క గుచ్చుకుని ఉంటుంది. ఆ పేకముక్కే అతిథి ఎంచుకున్న పేకముక్క అవుతుంది. అసిస్టెంట్ అవసరం ఏమాత్రం లేదు.



ఇందులోని మాయ అంతా పేకముక్కలపైన పరిచిన దినపత్రికలో వుంది. ఒకేరోజు పేపర్లను రెండింటిని తీసుకుని ఒక పేపరును మధ్యలో నాలుగు అంగుళాల పొడుగు, మూడు అంగుళాల వెడల్పు మేరకు కత్తిరించి దానికి సరిగ్గా రెండవ పేపరు మధ్యలో ఉంచి, మూడు పక్కలలో చివరన కొంచెం జిగురు రాసి అతికించాలి. అంటే సంచీమాదిరిగా ఒకవైపు ఖాళీగా ఉంటుందన్నమాట. సంచిలో ఒక పేకముక్క పడుతుంది. ఆ అతికించిన భాగం దూరంనుంచి చూస్తే కనపడదు.

ప్రదర్శన ప్రారంభించేముందు అందులో ఏదో ఒక పేకముక్కను, ఉదాహరణకు కళావరు 10 ఉంచి పేపరును మడిచి పక్కన ఉంచాలి. తరువాత వేరే పేకను తీసుకుని అతిథులకు చూపాలి. దాని పైముక్క కళావరు పది అయి ఉండేలా ముందుగానే మీరు కళావరు పదిని ఆ పేకపై ఉంచండి. తరువాత ఆ అతిథిని ఒకటి నుంచి ముప్పయిలోగా ఒక అంకెను చెప్పమనాలి. వారు ఇరవై అంటారనుకోండి, పేకనుంచి ఇరవైముక్కలను ఒక్కొక్కటి తీసి కింద ఉంచి ఇరవై అనగానే ఏదో తడబడినట్లు నటించి 'మళ్ళీ లెక్కపెడతాను' అని చెప్పి కింద ఉన్న ఇరవైముక్కలను మళ్ళీ పేకపై ఉంచి మళ్ళీ ఒకొక్కక్క ముక్కను లెక్కపెడుతూ ఇరవయ్యోవ ముక్కను తీసి అతిథికి చూపాలి. అది సరిగ్గా కళావరు పది అవుతుంది. తర్వాత ఆ ముక్కను మిగతావాటితో కలిపి, టేబుల్‌పై విడివిడిగా బోర్లించి, అటూ ఇటూ కలిపేసి, దానిమీద ఇందాక తయారుచేసిన దినపత్రికను వాటిపై మూసి చాకును చేతితో పట్టుకొని, కళ్ళకు గంతలు కట్టించుకొని, దినపత్రికను ఎడమచేతితో తడిమి, కుడిచేతితో చాకును తీసుకొని సరిగ్గా మనం తయారుచేసిన పేపరుసంచిపై గుచ్చి, అందులోని పది దీనికి గుచ్చుకోగానే, సరుక్రమని కత్తితో పేపరును చింపేస్తూ బయటకు లాగాలి. తరువాత కత్తిని గుచ్చుకున్న పేకముక్కను అందరికీ చూపించి పేపరును చింపి పడేయాలి. టేబుల్‌పై ఉన్న పేకముక్కలను కూడా వెంటనే తీసి లోపల పెట్టేయాలి.



# మేజిక్ కెమేరా

"ఫోటోగ్రఫీలో మనం చాలా ముందంజ వేశాం. ఇటీవల రూపొందిన పోలరాయిడ్ కెమేరాలద్వారా ఫోటో తీసిన రెండు నిమిషాల్లో మనం దాని ప్రింటును పొందవచ్చు. మేజిక్ రంగంలో అంతకంటే మంచి కెమేరాలు ఉన్నాయి. అయితే - ఈ మేజిక్ కెమేరాలతో కదిలే మనుషులను, వస్తువులను ఫోటో తీయలేం. స్థిరంగా ఉన్నవాటిని మాత్రమే ఈ రకం కెమేరాతో ఫోటో తీయగలుగుతాం" అని చెప్పి మెజీషియన్ ఖాళీగా ఉన్న ఫోటో ఫ్రేమ్‌ను ప్రేక్షకులకు చూపిస్తాడు.

దానిని టేబుల్‌పై ఉంచి, ఆ ఫ్రేమ్ పడిపోకుండా దాని వెనుక ఏదో ఒక వస్తువును ఆధారంగా పెడతాడు. నల్లని వస్త్రాన్ని ప్రేక్షకుల పరీక్షకు ఇచ్చి, ఆ వస్త్రాన్ని ఫోటో ఫ్రేముపై కప్పుతాడు. తరువాత ప్రేక్షకులలో ఒకరిని స్టేజిపైకి ఆహ్వానించి వారిచేతికి సినిమానటి లేదా రాజకీయ నాయకుని ఫోటోను ఇచ్చి ఆ బొమ్మను టేబుల్‌పై ఉన్న ఫోటో ఫ్రేముకు ఎదురుగా కదలకుండా పట్టుకోవలసిందిగా చెబుతాడు.



ఆ తరువాత మేజిక్ కర్రను వస్త్రంలో కప్పబడివున్న ఫోటోఫ్రేముపై మూడుసార్లు తిప్పి 'వన్, టూ, త్రీ' అని గట్టిగా అరుస్తూ ఫ్రేముపై ఉన్న వస్త్రాన్ని హఠాత్తుగా లాగేస్తాడు. అంతే! ఫ్రేముకు ఎదురుగా ఉన్న

ప్రేక్షకుని చేతిలోగల సినీనటి లేదా రాజకీయ నాయకుని బొమ్మ టేబుల్ పై ఉన్న ఫోటో ఫ్రేములో ప్రత్యక్షమవుతుంది. ప్రేక్షకుడిని ఆ ఫోటో ఫ్రేముకు ఎదురుగా నిలబెట్టి అతని చేతికి ఎవరో ఒకరి ఫోటో ఇచ్చిన తరువాత మెజీషియన్ ఆ ఫోటో ఫ్రేమును తాకటం కాని, దానిపై కప్పిన వస్త్రం కిందనుంచి తనచేతిని లోపలుంచి ఆ ఫోటో ఫ్రేమును తడమటంకాని చేయలేదు.

ఈ మేజిక్ చేయటానికి ముందు మనం ఒకే విధంగా ఉండే రెండు ఫోటోలు సంపాదించాలి. ఈ అంశంలోని గమ్మత్తంతా ఫోటో ఫ్రేములోనే ఉంది. ఆ ఫ్రేమును ముందుగా మనం తయారు చేయించుకోవాలి. ఫ్రేము మందం ఒక అంగుళం ఉండాలి. ఫ్రేమ్‌లో ముందుగా అద్దాన్ని అమర్చిన తర్వాత ప్రేక్షకులకు మనం చూపంచబోయే, ఫోటోకు సంబంధించిన ఒక కాపీని ఆ అద్దం వెనక ఉంచి ఆ ఫోటో వెనుక అట్టనుగాని చెక్కనుగాని బిగించాలి.

తరువాత ఫోటో ఫ్రేముకుగల పై అంచుచెక్కకు అడ్డంగా అర సెంటీమీటరు వెడల్పున పూర్తిగా తొలిచేసి గుల్లగా తయారుచేయాలి. ఇప్పుడు ఆ అంచుమీద సన్నని గాడిలా సందు ఏర్పడుతుంది. ఆ గాడిలోంచి కాగితాన్ని తేలికగా దూర్చవచ్చు. ఇప్పుడు ఫోటో ఫ్రేము ఎంత వెడల్పు ఉందో అంతసైజు నల్లని డ్రాయింగ్ పేపరును తీసుకొని దానిని ఫోటో ఫ్రేములో ఉన్న అద్దాన్ని మూసివేసే విధంగా పై అంచుకు ఉన్న గాడిలోంచి కిందకు జారవిడవాలి. కాగితం పై భాగం ఆ గాడిలోంచి పావు సెంటీమీటరు వరకూ పైకి పొడుచుకువచ్చే విధంగా అమర్చాలి. దళసరిగా ఉండే చెక్క, ఫోటో ఫ్రేముగా ఉంటుంది కనుక పైకి పొడుచుకు వచ్చిన ఆ పావు సెంటీమీటరు కాగితం ఎవరికీ కనిపించదు.

మేజిక్ కెమేరా గురించి ప్రేక్షకులకు చెప్పిన తరువాత ఫోటో ఫ్రేముపై మనం కప్పే నల్లని గుడ్డతోపాటే ఫ్రేములోంచి పైకి పొడుచుకువచ్చిన పావు సెంటీమీటరు నల్లని కాగితాన్ని పట్టుకొని పైకి లాగేస్తే ఫ్రేములో అమర్చిన మొత్తం నల్లని కాగితం బయటకు వచ్చేస్తుంది. ఆ నల్లని కాగితం నల్లని వస్త్రం అడుగున ఉంటుంది కనుక మీరు చేసిన మోసం ప్రేక్షకులకు తెలియదు. ఫ్రేము



ఎదురుగా నిలబడిన ప్రేక్షకుని చేతిలో ఉన్న ఫోటోకు సంబంధించిన ప్రింటే ఫోటో ఫ్రేములో ప్రత్యక్షమయినట్లు అందరూ భావిస్తారు. ఈ అంశం చేసేటపుడు ఒకే ఒక్కచోట మనం జాగ్రత్తగా ఉండాలి. ఫోటో ఫ్రేములో మనం ఏ ఫోటో అమర్చామో అదే ఫోటోకు చెందిన మరో కాపీ ప్రేక్షకునికి ఇవ్వాల్సి ఉంటుంది. రెండూ వేరు వేరు ఫోటోలైతే ప్రదర్శన చెడిపోవటం ఖాయం.

*మీ ప్రదర్శన అనంతరం మీ స్నేహితులను కలిసి మీరు చేసిన ప్రదర్శనలో పొరపాట్లను నిర్మొహమాటంగా చెప్పమనండి. వారి సలహాలను పాటించండి. పెద్దలను సంప్రదించి ప్రదర్శనలో మార్పులు చేయండి.*

# పహిల్వాన్ పేకముక్క

మెజీషియన్ ఒక పేకముక్కను, ఒక ఖాళీ గాజు గ్లాసును ప్రేక్షకులకు పరీక్షకు ఇస్తాడు. ఆ పేక ముక్కకు ఉన్న బలాన్ని ఎవరూ అంచనా వేయలేరు. ఒక పహిల్వాన్‌కు ఉన్నంత శక్తి ఆ పేక ముక్కకు ఉన్నదనీ, దీనికంటె ఎన్నోరెట్లు బరువైన గాజు గ్లాసును ఆ పేక ముక్క మీద నిలబెట్టవచ్చనీ ప్రేక్షకులతో చెప్పి గ్లాసును ఎడంచేత్తో పట్టుకుంటాడు. మెజీషియన్ కుడి చేత్తో పేకముక్కను పట్టుకొని గాజు గ్లాసును పేక ముక్కపై నిలబెడతాడు. బరువైన ఆ గ్లాసుకంటె ఎంతో తేలికగా వుండే పేక ముక్క గ్లాసు బరువును యెలా భరించింది?

పేకముక్కను కుడిచేతి వేళ్ళతో పట్టుకున్నప్పుడు చూపుడ వేలును ఖాళీగా వుంచాలి. గ్లాసును పేకముక్క మీద పెట్టినపుడు దాని అడుగు భాగంలో కుడి చేతి చూపుడు వేలును ఆధారంగా ఉంచాలి. చూసేవారికి పేకముక్క అడ్డంగా ఉంటుంది. కనుక చూపుడు వేలు ఆధారంగా పెట్టినట్లు తెలియదు. పేకముక్క బదులుగా విజిటింగ్ కార్డును కూడా ఉపయోగించవచ్చును.




ఈ ట్రిక్కు చేసేటప్పుడు మన వెనుక ఎవరూ లేకుండా చూసుకోవాలి. మొదట ప్రాక్టీసు చేసేటప్పుడు గాజు గ్లాసులతో కన్నా ప్లాస్టిక్ గ్లాసుల్తో చేయటం మంచిది. క్రింద పడితే పగలవు.



బి.వి.పట్టాభిరామ్

# కళ్లు మూసుకున్నా కనిపించే రంగులు

నేను నిర్వహించిన బాలానందం మేజిక్‌స్కూల్లో నేర్చుకుని పైకివచ్చిన ముఖ్యుల్లో సామాల వేణు ఒకరు. అతను మైండ్ రీడింగ్ ఆధారంగా ఎన్నో అంశాలు చేస్తారు వారిని మేజిక్ క్లబ్‌లలో మైండ్ రీడింగ్ వేణుగా వ్యవహరిస్తారు. అతని సమర్థతను గిన్నీసు బుక్ వారుకూడా గుర్తించటం గర్వించదగ్గ విషయమే.

మెజీషియన్ కొన్ని రంగురుమాళ్ళను టేబులుమీద ఉంచి, ఆ తరువాత తన అసిస్టెంటు కళ్ళకు గంతలు కట్టి స్టేజిపైన ఒక పక్కగా కుర్చీలో కూర్చోబెడ్తాడు తరువాత టేబులుమీద ఉన్న ఒక్కొక్క రుమాలును తీసి "ఇది ఏ రంగులో ఉంది" అని ఆ అసిస్టెంటును అడుగుతాడు. కళ్ళకు గంతలు కట్టుకున్న అసిస్టెంటు అన్ని రంగులనూ సరిగానే చెప్తాడు. ఇందులో ప్రశ్నలు అడిగే పద్ధతిలో ఎటువంటి పరిభాషా లేదు. రంగులు చూడటంలో కూడా ఎటువంటి వరుసక్రమమూ లేదు. అయినా అసిస్టెంటు అన్ని రంగులూ చెప్పగలుగుతాడు. కావాలంటే ప్రేక్షకులనుంచి కొందరు వచ్చి వారికిచ్చిన రుమాళ్ళను తీసి వాటి రంగును కూడా అడగమని చెబుతాడు. అప్పుడుకూడా కళ్ళకు గంతలు కట్టుకున్న అసిస్టెంటు అన్నీ సరిగా చెప్పగలుగుతాడు.



ఇది కేవలం తన అసిస్టెంటు అతీంద్రియ శక్తివలననే చేయగలిగాడని మెజీషియన్ చెబుతాడు.

ఇందులో అసలు బండారం, స్టేజిమీద మైకు, లైట్లు చూసే ఎలక్ట్రీషియన్‌లా కనబడే మరొక రహస్యమైన అసిస్టెంటులో ఉంది. ముందుగా కళ్ళకు గంతలు కట్టుకొని ఉండే అసిస్టెంటు చూపుడువేలుకు నల్లని దారంకట్టి దాని రెండవచివరను ఎలక్ట్రీషియన్‌లా ఉండే అసిస్టెంటుకు ఇవ్వాలి. అతను ఏమీ తెలియనట్లు స్టేజిమీద ఓ పక్కగా కూర్చొని ఉంటాడు. వీరిద్దరికీ ఒక అవగాహన ఉంటుంది. ఎర్ర రంగు రుమాలు చూసినపుడు, రెండవ అసిస్టెంటు దారాన్ని ఒకసారి లాగుతాడు. అదేవిధంగా రెండుసార్లు లాగితే నీలం అనీ ముందుగా అనుకున్న పద్ధతి ప్రకారం దారం లాగుతాడు. కానీ రెండవవాడు ఇంతచేసినా ఏమీ తెలియనట్లు తాను అతని చర్యలకు ఆశ్చర్యబోతున్నట్లు 'ఆహా! ఓహో' అంటూ పరమ అమాయకుడిలా స్టేజిమీద నటించాలి. ఇది జాగ్రత్తగా చేస్తే చాలా చక్కగా రక్తికడుతుంది.

*ఇతర మెజీషియన్లను గౌరవించండి. మీలోని కళను పైకి తీయండి. మీకు ఎటువంటి సహాయసహకారాలనైనా అందజేయడానికి ఎందరో ఉన్నారు. వారిలో నేనూ ఒకడిని.*



# కళ్ళు మూసుకోండి - అన్నీ కనిపిస్తాయి

పది పదిహేనేళ్ళ వయసు గల ఇద్దరు కుర్రాళ్ళు ఓసారి నన్ను కలిశారు. తాము కూడా మేజిక్ చెయ్యగలమనీ కావాలంటే ఒక అంశాన్ని ప్రదర్శించి చూపిస్తామనీ చెప్పి పెద్దవాడు అక్కడ గల టేబులుమీద ఉన్న తువ్వాలుతో చిన్న వాడి కళ్ళకు గంతలు కట్టి అతనికి చిన్నతనంలోనే కొన్ని శక్తులు సంక్రమించాయనీ, ఏ వస్తువునైనా కళ్ళకు గంతలు కట్టుకొని కూడా చూడగలడనీ చెప్పాడు. తరువాత నా దగ్గర నుంచి వాచీ, పెన్ను, పర్సు, ఉంగరం, కళ్ళ జోడు, పుస్తకం, తాళాల గుత్తి, అద్దం, వగైరాలు తీసుకొని అన్నీ టేబుల్ మీద పెట్టి నా ఇష్టమైన పద్ధతిలో అమర్చుకోమన్నాడు. వాటిని వరుసగా పేర్చాను నేను.

పెద్దవాడు కళ్ళకు గంతలు కట్టుకున్న కుర్రవాడిని ఒక మూలగా నిలబెట్టి తర్వాత అతను టేబులు వద్దకు వచ్చి అక్కడున్న వస్తువులలో అద్దాం చూపించి 'ఇదేమిటి' అని అడిగాడు. వెంటనే కళ్ళకు గంతలు కట్టుకున్న కుర్రవాడు 'అద్దం' అన్నాడు. తరువాత పర్సు చూపి ఇదేమిటని అడిగాడు. అతను 'పర్సు' అని చెప్పాడు. అదే విధంగా మొత్తం అక్కడున్న వస్తువులన్నిటినీ సరిగ్గా తప్పులేకుండా చెప్పాడు. ఇందులో ప్రశ్నలు అడిగే రీతిలో తేడాలేదు. ఎటువంటి సంజ్ఞలు చేయలేదు.



వారిద్దరి మధ్యలో మూడు గజాలు దూరం ఉంది. అయినాసరే చెప్పగలిగాడు. వారిద్దరూ కుర్రవాళ్ళయినా ఈ అంశాన్ని చాలా బాగా ప్రదర్శించారు.

ఈ అంశాన్ని ఎవరైనా సరే చాలా తేలికగా ప్రదర్శించవచ్చు. దీని కిటుకు ఇద్దరిమీదా ఆధారపడి ఉంది. ఈ ప్రదర్శన చేయటానికి ముందు వారిద్దరూ ఒక ఒప్పందం కుదుర్చుకోవాలి. అలాగే వస్తువుల పేర్లు ఒక క్రమంలో ఏర్పరుచుకోవాలి. అంటే ముందుగా అద్దం చూపించి అడగాలి. తరువాత పర్సు, ఆ తర్వాత వాచీ, పెన్ను, కళ్ళజోడు, పుస్తకం తాళాలు, ఉంగరం ఇదేప్రకారం వరుసలో అడగాలి. ఈ వస్తువులు అందరి వద్దా ఉంటాయి కనుక సులువుగా చేయవచ్చు.

పోతే చిన్న విషయం. ఒకవేళ పెన్ను చెప్పిన తరువాత అక్కడ కళ్ళజోడు లేదనుకోండి. అప్పుడు మీరు చిన్నగా దగ్గి "సరే-అయితే ఇదేమిటో చెప్పండి" అని పుస్తకం చూపించాలి. ఇది రహస్యసంకేతం అన్నమాట. అంటే దగ్గినపుడు ఆ తరువాత వచ్చే వస్తువు అక్కడ లేదన్నమాట. అటువంటి సమయంలో ఆ తరువాత వచ్చే వస్తువు పేరు చెప్పాలి. మరో విషయం. ప్రతిసారీ అద్దంతోనే మొదలు పెట్టకూడదు. రెండుమూడుసార్లు చూసిన వారికి అనుమానం కలిగే ప్రమాదం ఉంది. అందువల్ల రెండు మూడు పద్ధతులలో వస్తువుల వరుసలు తయారు చేసుకోవాలి. అలాంటపుడు ఏ పద్ధతిలో ఏ వస్తువు తరువాత ఏది ఉంటుందో జాగ్రత్తగా గుర్తుపెట్టుకోవాలి.



# మాయ చేసే ఫలాలు

"ఒక్కోసారి మనకళ్ళే మనల్ని మోసం చేస్తాయి. మనం చూశామనుకున్నది నిజంగా అక్కడ ఉండదు. లేనిది ఉన్నట్లుగా భావిస్తాము. దానినే ఇల్యూషన్ అంటారు. ఎవరూ మాట్లాడకపోయినా మాట్లాడినట్లు అనిపించడం, లేనివి ఉన్నట్లుగా అనుకోవటంలాంటి అనుభవాలను డెల్యూషన్స్ అంటారు. ప్రతి వ్యక్తీ జీవితంలో తప్పక ఇటువంటి అనుభవాలు పొందుతాడు. ముందుగా స్టేజిమీద మెజీషియన్ తన మేజిక్ ద్వారాను, హిప్నాటిజం ద్వారాను ప్రేక్షకులలో ఎక్కువ మందిని ఈ భావనకు లోను చేయగలుగుతాడు. ఇపుడు నేను ఈ శక్తి ద్వారా మిమ్మల్ని అలాంటి అనుభూతికి గురిచేస్తాను" 'అని మెజీషియన్ ప్రేక్షకులనుండి ఒకరిని స్టేజిపైకి ఆహ్వానించి టేబుల్‌పై ఉన్న చిన్న పళ్ళెంలోని ఐదారు కమలాఫలాలను చూపించి పరీక్ష చేయమంటాడు.

తరువాత ప్రేక్షకుని నుంచి వారి రుమాలును తీసుకొని పళ్ళెంలోంచి ఒక కమలాఫలాన్ని తను తీసుకొని టోపీలో ఉంచి, మేజిక్ కర్రతో టోపీ చుట్టూ తిప్పి, వెంటనే ఆ టోపీలో చెయ్యి పెట్టి కమలాఫలాన్ని బయటకు తీయబోతాడు. కానీ బయటకు వచ్చినది కమలాఫలంకాదు. ఆపిల్‌పండు. అపుడు మెజీషియన్ ప్రేక్షకులతో "మీరు చూసినది నిజంగా కమలాఫలం కాదు, అది ఆపిల్ పండే ఇప్పుడు చూడండి ఈ ఆపిల్‌ను కత్తితో పనిలేకుండా కోసి చూపిస్తాను" అని చెప్పి ఆపిల్‌ను రెండుచేతుల మధ్యలో నుంచి నొక్కగానే ఆపిల్ రెండు ముక్కలుగా విడిపోతుంది. ఆ భాగాలనుచూస్తే నిజంగా అవి కత్తితో కోసినట్లే ఉంటాయి. కానీ మెజీషియన్ చేతిలో కత్తిగానీ, బ్లేడుకానీ రహస్యంగా దాచుకోలేదు. తరువాత మెజీషియన్ అందులోని ఒక భాగాన్ని ప్రేక్షకులకిచ్చి తిని ఎలావుందో చెప్పమని తనొక భాగం తీసుకొని తింటాడు.

ఇందులో రెండు రహస్యాలు ఉన్నాయి. ఫలంలా కనపడటం, రెండవది ఆపిల్‌ను కత్తి సాయం లేకుండా కోయటం. ముందుగా మీరు సూదీ దారాన్ని తీసుకుని ఆపిల్ పండును అష్ట భుజ ఆకారంలో కుట్టాలి. ఆ తరువాత దారం రెండు చివరలను లాగితే ఆపిల్ సరిగ్గా రెండు ముక్కలుగా కోయబడుతుంది. కానీ పైనుండి చూస్తే కోసినట్లు కనబడదు. ప్రదర్శన సమయంలో సూది గుచ్చిన భాగంలో గట్టిగా నొక్కితే పండు రెండు భాగాలుగా విడిపోతుంది.



ఇకపోతే ఆపిల్ కమలాఫలంలా కనపడటం కూడా మేజిక్కే. ముందుగా ఒక కమలాఫలాన్ని తీసుకొని దాని తొక్క భాగాన్ని బ్లేడుతో సన్నగా సగం కోసి లోపల బంతిలా వుండే తొనలను జాగ్రత్తగా బయటకు తీసేయాలి. ఇపుడు ఇంతకుముందు తయారు చేసిన ఆపిల్‌ను మెల్లగా ఆ తొక్కలో ఉంచి కమలాఫలంలా కనిపించే ఆపిల్‌ను మిగిలిన కమలా ఫలాలతో పాటే పళ్ళెంలో ఉంచండి. మామూలు పళ్ళను పరీక్ష చేయించి మీ ప్రదర్శనను ప్రారంభించాలి.

*మేజిక్ ప్రదర్శన అనగానే ప్రేక్షకులు ఒక ప్రత్యేకతను ఆశిస్తారు. తెర తీయగానే సుందరంగా అలంకరించబడిన స్టేజీ మధ్యలో ఒక టేబిల్, దాని పైన క్రింద మూడు వైపులా కవర్ చేయబడిన టేబిల్ క్లాత్ దానిపైన వస్తువులు అలంకరించి ఉండాలి.*



# మెజీషియన్లను తికమక పెట్టిన మేజిక్

1974లో పాలకొల్లులో మెజీషియన్ల సమావేశం జరిగింది. స్టేజీమీదకు ఒక్కొక్క మెజీషియను వచ్చి ఒక్కో ప్రత్యేక అంశాన్ని చేసి చూపించసాగారు. చివరగా ఐంద్రజాలికుడు ప్రొఫెసర్ హుసేన్ ప్రదర్శన ప్రారంభిస్తూ, "ఇవాళ నేను ఏ అంశాన్నీ చెయ్యను. కాని మా అబ్బాయి మాత్రం ఓ అంశం ప్రదర్శిస్తాడు. ఇక్కడ టేబుల్‌మీద బొమ్మలు వేసి వున్న నాలుగు స్టేండులు ఉన్నాయి. మొదటి దానిమీద ముక్కోణం, రెండవ దానిమీద చదరం. మూడవదానిమీద వృత్తం, నాల్గవ దానిమీద నక్షత్రం బొమ్మలున్నాయి. ఇపుడు మీలో ఎవరో ఒకరు వచ్చి ఇక్కడ ఉన్న నాలుగు బొమ్మలలో ఒక బొమ్మను ఎన్నుకొని, ఒక పేపరుమీద రాసి ఆ కాగితాన్ని మీ జేబులోనే ఉంచుకోండి. మీరు రాసిన తరువాత మా కుర్రవాడు బయటనుండి వచ్చి, మిమ్మల్నీ ఆ బొమ్మలనూ ఒకసారి పరికించి మీరు ఎన్నుకున్న బొమ్మ ఏమిటో చెప్తాడు. ఆ సమయంలో నేను అతనికి ఏమైనా సౌంజ్ఞలు చేస్తాననే అనుమానం మీకు ఉండవచ్చు కాబట్టి అతను వచ్చినప్పుడు నేనుకూడా స్టేజీమీద ఉండను" అని చెప్పి తన కుమారునిచేత ఆ అంశాన్ని చేయించి, మెజీషియన్ల మన్ననలను పొందాడు.

సమావేశానికి వచ్చిన మెజీషియన్ల బుర్రలు ఎంత వేగంగా పనిచేసినా దాని అంతు తెలుసుకోలేకపోయారు. చివరికి మెజీసియన్లందరికీ దాని రహస్యం తెలిపి వారిని ఆశ్చర్యంలో ముంచారు ప్రొఫెసర్ హుసేన్.

ఈ అంశం స్టేజి మీద చేసినపుడు చాలా గొప్పగా రక్తి కడుతుంది. ఇందులోని అసలు రహస్యం అంతా అసలు ఏమాత్రమూ ప్రాముఖ్యం వహించని పెన్నులో ఉంది. ప్రేక్షకుడు స్టేజీమీదకు వచ్చినపుడు మెజీషియన్ వారితో అక్కడ ఉన్న 4 బొమ్మలలో ఒకటి ఎన్నుకోమని చెప్పి, ఆ తరువాత దానిని

కాగితంమీద రాయవలసిందిగా ఒక పెన్ను, కాగితం అందిస్తాడు. వారు ఆ పెన్నును మెజీషియన్‌కు తిరిగి ఇస్తారు. ప్రేక్షకుడు రాసినపుడు ప్రక్కనే మెజీషియన్ కూడా ఉంటాడు కనుక అదేమిటో చూసి, అది తన అసిస్టెంటుకు రహస్య సంకేతం ద్వారా తెలియ చేస్తాడు. ఆ సంకేతం పెన్ను ఉంచే విధానంలో ఉంటుంది.



ఉదాహరణకు టేబుల్‌మీద పెన్ను ఉంచినపుడు మూతఉన్న భాగం పైకి ఉంచితే ప్రేక్షకుడు మొదటి బొమ్మను,

కుడిపక్కకు ఉంచితే రెండవ బొమ్మ

కిందకు ఉంచితే మూడవ బొమ్మ

ఎడమ పక్కకయితే నాల్గవ బొమ్మ

ఆ గుర్తులను ముందుగానే అసిస్టెంటుకు మెజీషియన్ చెప్పాలి. ప్రేక్షకుడు ఎన్నుకున్న బొమ్మను బట్టి మెజీషియన్ పెన్నును ఆ ప్రకారం అక్కడ ఉంచి ఏమీ తెలియనట్లు అక్కడ నుండి బయటకు వెళ్తాడు. తరువాత అతని అసిస్టెంటు వచ్చి పెన్ను ఉన్న విధానాన్ని బట్టి ఏ బొమ్మను ప్రేక్షకుడు ఎంచుకున్నాడో గ్రహించి ఏమీ తెలియనట్లు బొమ్మలవైపు, ప్రేక్షకులవైపు తీక్షణంగా చూసినట్లు నటించి ప్రేక్షకుడు ఎన్నుకున్న బొమ్మ ఫలానా అని చెబుతాడు. ఇది ఎన్నిసార్లయినా చేయవచ్చు.



# దయ్యం పెట్టె

మన దేశంలో కళ్ళకు గంతలు కట్టుకొని జనసందోహం ఎక్కువగా ఉన్న వీధులలో మొట్టమొదటి సారిగా స్కూటరు నడిపిన మెజీషియన్ శ్రీ గోగియాపాషా. ఆయన స్వదేశంలో కంటే విదేశాలలోనే ఎక్కువగా ప్రదర్శనలు ఇచ్చారు. గోగియాపాషా అసలు పేరు ధనరాజ్ గోగియా 'పాషా' అనేది ఈజిప్షియనులు ఇచ్చిన బిరుదు. పాషా 'గిలిగిలి గోగియా' గా కూడా సుప్రసిద్ధుడే. ఆయన మేజిక్ చేసేటప్పుడు 'గిలిగిలి' అంటూ మంత్రం చదువుతారు.

గోగియా పాషా చేసే అంశాలలో అందరినీ ఆకర్షించే అంశం. ఒక ఖాళీ పెట్టెను ముందుగా అందరికీ చూపించిన తరువాత ఆ పెట్టెను మూసి గిలిగిలీ అంటూ మంత్రాలు చదివి అందులోంచి ఎన్నో హారాలను బయటకు తీసేవారు. సాధారణంగా ఇలాంటి పెట్టెలు మెజీషియన్లందరి దగ్గరా ఒక్కోటి ఉంటాయి. ఒక్కొక్కరు ఒక్కో రకమైన వస్తువులను సృష్టిస్తూ ఉంటారు. ఈ పెట్టెలపై 'డెవిల్స్ బాక్స్' అని రాసి ఉంటుంది. అంటే దెయ్యం పెట్టె అని అర్థం.



మీరు ముందుగా ఖాళీ చెక్క పెట్టెను ప్రేక్షకులకు చూపించాలి. తరువాత దానిని మూసేసి ఏదో ఒక మంత్రం చదివి పెట్టెమూత తెరవండి. అందులోంచి రూపాయినోట్లు, చాక్లెట్లు, పువ్వులు, రిబ్బన్లు చిన్న చిన్న జేబురుమాళ్ళు వగైరాలను తీసి ప్రేక్షకులకు ఇవ్వండి.

ఈ పెట్టెను ముందుగా మీరు చెక్కతో కానీ రేకుతోకానీ చేయించుకోవాలి. పెట్టె నాలుగంగుళాల ఎత్తు, ఆరు అంగుళాల పొడుగు అంతే వెడల్పూ ఉంటే చాలు. కావాలంటే మీరు ఇంకా చిన్నది లేదా పెద్దదికూడా చేసుకోవచ్చు. పెట్టెకు ముందువైపు ఒక తలుపు, వెనుకవైపు ఒక తలుపు ఉంటాయి. ఈ తలుపులు తెరచినపుడు క్రిందకు వ్రేళ్ళాడుతూ ఉండాలి. తరువాత పైన ఒక తలుపు ఉంటుంది. ఇకపోతే అసలు రహస్యం వెనుకవైపు ఉన్న తలుపులో ఉంది. ఆ తలుపునకు లోపలివైపు మరొక చిన్న అరను అమర్చాలి. అందులో చాక్లెట్లనూ, రూపాయి నోట్లనూ ఇతర చిన్న చిన్న వస్తువులనూ ఉంచి పైన చిన్న కాగితం అతికించి ప్రదర్శనకు సిద్ధంగా ఉంచుకోవాలి.

ప్రదర్శన ప్రారంభిచేముందు పెట్టెను చూపించి, మొదట రహస్య అరగల వెనుక తలుపును తీసి తరువాత ముందు తలుపును తీయండి. ప్రేక్షకులకు పెట్టె ఖాళీగా ఉన్నట్లుగా కనబడుతుంది. ఎందుచేతనంటే సామానువున్న వెనుక తలుపువెనుకకు వేళ్ళాడుతూ ఉంటుంది. కనుక ప్రేక్షకులకు రహస్యం తెలియదు. పెట్టెను మూసేటప్పుడు మొదట ముందు వైపు తలుపును, ఆ తరువాత వెనుక తలుపును మూసేయాలి అంటే సామాను ఇపుడు మళ్ళా పెట్టెలోకి వచ్చేసిందన్నమాట. మీరు మేజిక్ కర్రతో పెట్టెమీద మూడుసార్లు తిప్పి పై తలుపును తీసి నోట్లను, రుమాళ్ళను సృష్టిస్తున్నట్లుగా నటించి వాటిని ప్రేక్షకులకు ఇవ్వండి. మీరు తలుపులు వేయటంలో ఏమాత్రం పొరపాటు జరిగినా మొత్తం ప్రదర్శన చెడిపోతుంది జాగ్రత్త!



# ఆహార సమస్యను పరిష్కరించండి

"ప్రస్తుతం భారతదేశం ఆహార సమస్యను తీవ్రంగా ఎదుర్కొంటున్నది. ఈ సమస్యను అరికట్టడానికి ప్రభుత్వం తగిన చర్యలు తీసుకుంటున్నా, ఫలితం కనబడటం లేదు. కాబట్టి భారతీయులందరూ ఆహారం సమృద్ధిగా పండించడానికి తగిన కృషి చేయాలి. అదే ప్రకారంగా మా ఇంద్రజాలికులు కూడా ఆహారోత్పత్తికి ఎంతో కొంత సహాయం చేస్తూనే ఉన్నాం" అని మెజీషియన్ ఓ ఉపన్యాసం ఇచ్చిన తరువాత, టేబుల్‌మీద నున్న ఒక పేక సెట్టును తీసి, దానిని నాలుగయిదుసార్లు బాగా కలిపి ప్రేక్షకులనుండి ఒకరిని స్టేజిమీదకు ఆహ్వానిస్తాడు. వారు వచ్చిన తరువాత పేకను మరోసారి కలిపి వారిని నోరు తెరువమని చెప్పి, ఆ పేకను వారి నోటి దగ్గర ఉంచగానే పేకలో నుండి గలగలమని బఠానీలు, శనగలు, మరమరాలు ఆయన నోటినిండా పడతాయి. ప్రేక్షకులు ఒన్స్‌మోర్ అన్నారనుకోండి. వెంటనే ఆ పేకను మళ్ళీ వారి నోటిదగ్గర వంచి తిరిగి తినుబండారాలను సృష్టిస్తాడు.



ఈ అంశం పిల్లలను బాగా ఆకర్షిస్తుంది. ఆశ్చర్యంగా కనబడే ఈ అంశానికి మీరు ముందుగా కొంత శ్రమతీసుకుని చేసే పని ఉంది. ఇందులో ప్రదర్శించే పేక మామూలు పేక కాదు. దీనిని ముందుగా మీరు తయారు చేసుకోవాలి. ఈ విధానాన్ని జాగ్రత్తగా గమనిస్తే చాలా సులువుగా తయారు చేసుకోవచ్చు.

పేకలో నున్న 52 ముక్కల్లో ముందుగా మీరు 45 ముక్కల్ని తీసుకోవాలి. ఇపుడు ఒక్కొక్క ముక్కను తీసుకొని, మధ్యనుండి ఒక ప్రక్కకు కొంత భాగాన్ని కత్తిరించాలి. అంటే ఇంగ్లీషులో యు (U) అనే అక్షరం ఆకారం వచ్చేలాగ ప్రతి ముక్కను కత్తిరించాలి. ఈ ప్రకారం 45 ముక్కలనూ ఒకే రీతిగా కత్తిరించి వాటిని ఒక దానిమీద ఒకటి జిగురుతో అంటించాలి. అంటే ఇపుడు 'యు' ఆకారంలో ఉండే ఒక పేక కట్టలాగ తయారవుతుంది. తరువాత మిగిలి ఉన్న మామూలు ముక్కలలో రెండు తీసుకుని ఈ కట్టకు పైన ఒకటి, క్రింద ఒకటి జిగురుతో అంటించాలి. ఇపుడు మూడువైపులనుండీ చూస్తే మామూలు పేక కట్టలాగ కనిపిస్తుంది. ఒక వైపు మాత్రం ఖాళీ ఉంటుంది. అంటే అది మామూలు పేకసెట్ ఆకారంలో ఉండే చిన్న సంచిలాగ తయారయిందన్నమాట. ఇపుడు మీరు మిగిలిన ముక్కలను ఈ కట్టకుపైన మామూలుగా ఉంచి, ఈ సంచిలో తినుబండారాలను వేసి ప్రదర్శనకు సిద్ధంగా ఉంచుకోవాలి.

ప్రదర్శన ప్రారంభించే ముందు ఈ సెట్‌ను జాగ్రత్తగా ఎడమచేతిలోనికి తీసుకుని, తెరచి ఉన్నభాగాన్ని పైకి ఉండేలాగ పట్టుకుని, పై ముక్కలతో పైపైనే కలిపి, ప్రేక్షకులలో ఒకరిని పిలిచి వారి నోటిలో ఈ పేకను కొద్దిగా వంచాలి. వెంటనే అందులో ఉన్న పదార్థాలు వారి నోటిలో పడతాయి. ప్రేక్షకులు ఒన్స్‌మోర్ అన్నప్పుడు ఈ పేకను మళ్ళీ వారి నోటిదగ్గర ఉంచి, ఈసారి పూర్తిగా వంచేయాలి. యీసారి అందులో ఉన్నవన్నీ పూర్తిగా వారి నోటిలో పడతాయి. తినుబండారాలు వాళ్ళ నోట్లో పడేటప్పుడు కళ్ళుమూసుకోమని చెప్పడం మంచిది లేదా మీ సీక్రెట్ బయటపడిపోతుంది. పైగా వాళ్ళకంటికి హాని కలుగదు.



మేజిక్, గారడీ, ఇంద్రజాలం, కనికట్టు, మతికట్టులాంటి విద్యలు చూస్తున్నప్పుడు ఎవరికైనా ఆశ్చర్యం, ఆనందం కలగకమానదు. నిజానికి ఈ విద్యలలో మంత్రాలు, తంత్రాలు లేవు. హస్తలాఘవం, సమయస్ఫూర్తి ఈ కళలకు ప్రాథమిక అవసరాలు. అయితే చాలా మేజిక్‌ల వెనుక ఒక విజ్ఞానశాస్త్ర సూత్రం వుంటుంది. అది గణితం కావచ్చు, భౌతికశాస్త్రం కావచ్చు, రసాయనిక శాస్త్రం కావచ్చు. ఆ రహస్యం పట్టుకున్నవారు ఎవరైనా ఈ మేజిక్‌లను ప్రదర్శించవచ్చు. ఒకసారి మేజిక్ చేయటం ప్రారంభిస్తే మన ఆలోచనలతో మనకు తెలిసిన విజ్ఞానశాస్త్ర సూత్రాలను అన్వయించుకుని అనేక కొత్త మేజిక్‌లను కనిపెట్టవచ్చు.

విద్యార్థుల్లో వారు చదువుతున్న విజ్ఞానశాస్త్ర పాఠ్యాంశాల్లో ఆసక్తి రేకెత్తించడానికి విదేశాల్లో మేజిక్‌ను ఉపయోగించడం పరిపాటి. ఈ రకమైన పుస్తకాలు విదేశాల్లో విస్తృతంగా అందుబాటులో ఉన్నాయి. మనదేశంలో ఆ లోటు తీర్చడానికే ఈ మాయావినోదం సీరిస్‌ను అందిస్తున్నాం.

ఈ పుస్తకాలు మీకందించడానికి తెలుగులో మేజిక్ కళ విస్తృతమైన ప్రాచుర్యాన్ని తెచ్చిన, దేశవిదేశాల్లో అనేక ప్రదర్శనలతో తెలుగువారి గౌరవాన్ని ఇనుమడింపచేసిన డా॥ బి.వి.పట్టాభిరామ్‌ను తగిన వ్యక్తిగా ఎమెస్కో భావించింది.

ఈ పుస్తకాలలో ఆయన మేజిక్ విజ్ఞానానికి సంబంధించిన అనేక అంశాలను చర్చించడంతోపాటు, మీ అందరికి అర్థమయ్యేలాగ అనేక మేజిక్‌లను ఎలా చేయాలో సచిత్రంగా వివరించారు. మేజిక్ గురించి తెలుసుకోవాలనుకునేవారికి, నేర్చుకుందామనుకునేవారికి ఈ అయిదు పుస్తకాలు కరదీపికలు.

ఎమెస్కో